# దురాచార పిశాచ భంజని
# ఆచార నిరుక్తి
# విగ్రహారాధన తారావళి

"మహాకవి" దాసు శ్రీరామ విరచితము

ప్రచురణ:
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి
"వాణీసదనము" 3-4-885/A, బర్కత్‌పురా
హైదరాబాదు - 27

వెల రూ 8-00

# దురాచార పిశాచ భంజని
# ఆచార నిరుక్తి
# విగ్రహారాధన తారావళి

"మహాకవి" దాసు శ్రీరామ విరచితము

ప్రచురణ:
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి
"వాణీసదనము" 3-4-885/A, బర్కత్‌పురా
హైదరాబాదు - 27

# మున్నుడి

మహాకవి దాసు శ్రీరాములుగారి స్మారక సమితిని స్థాపించి యా మహాకవి విరచిత గ్రంథముల పునర్ముద్రణకు పూనుకొంటిమి. లభ్యములైన గ్రంథములను కొన్నింటిని ముద్రించి కృతకృత్యులమైతిమి. ఈ మా కృషిని పండితమాన్యులాదరించి ప్రోత్సహించిరి. వారికి మా కృతజ్ఞతాభివందనములు. ఈ ఉత్సాహమును పురస్కరించుకొనియే ''దురాచార పిశాచ భంజని'', 'ఆచారనిరుక్తి', 'విగ్రహారాధనతారావళి' అను ఈ చిన్ని గ్రంథములను మూడింటిని పుష్పితాగుచ్ఛము వలె ఒకటిగా చేర్చి పునర్ముద్రించి సహృదయుల హస్తములందుంచుచున్నాము.

'దురాచార పిశాచ భంజని' 'ఆచార నిరుక్తి' అను ఈ గ్రంథములను మహాకవి దాసు శ్రీరాములుగారు 1890లో రచించిరి. వీనిలో 'ఆచారనిరుక్తి'ని ముందు రచించినట్లు ఈ గ్రంథ పీఠికలో వ్రాసిరి.

వాస్తవమునకు ఈ రెండునూ రెండు చిన్నవ్యాసములు. కాని కవిగారు వీనిని చిన్న గ్రంథములనియే పేర్కొనిరి. కవిగారే ఈ రెండింటికి వ్యాఖ్యానములు వ్రాసి 'దురాచారపిశాచభంజని' వ్యాఖ్యకు వారి మేనత్తకుమారుడైన శ్రీ కనకయ్యగారి పేరును, సుబోధ వ్యాఖ్యకు శ్రీ పప్పు జగన్నాధకవి గారి పేరును పెట్టినట్లు శ్రీ దాసు విష్ణురావు గారు రచించిన 'శ్రీరామకవి జీవిత చరిత్ర'లో వ్రాసిరి. అన్ని ఆచారములు శిష్టాచారము లనుకొనుట భ్రాంతి. పండితులలో పామరులలో పాదుకొన్న ఈ భ్రాంతిని తొలగించి ఏవి శిష్టాచారములో ఏవి దురాచారములో ఏవి వర్జనీయములో, ఏవి ఆచరణీయములో తెలుపుటకు 'దురాచార పిశాచభంజని'ని వ్రాసిరి. 'ఆచార నిరుక్తి' యందు ఆచార శబ్దార్థమును విపులముగా వర్ణించి వివరించిరి. 'ఆచార' పదార్థమును తెలియకనే ఆచారవిషయక శాస్త్రమును చూడదలంచుట నిష్ప్రయోజనము. ఈ భరతఖండమునందు నానావిధాచారములు ప్రబలి నేటివరకు సాగివచ్చుచున్నవి. కొన్ని సంఘమునకు బాధాకరములు కావు. కాని కొన్ని లోకబాధాకరములు. లోకబాధాకరములగు నాచారములను వదలినగాని మనదేశము బాగుపడదు. ఈ ఉద్దేశముతోనే కవిగారు ఈ రెండు గ్రంథములు రచించిరి.

'ఆచార నిరుక్తి'యందు మూడు వాక్యములను వ్రాసిరి.

1. అథాచారం నిర్వదిష్యామి
2. ఆచారో ధర్మానుష్ఠిత శాస్త్రి
3. సజాతీయ క్రియాపరంపరా చరణ మితరత్ర

ఈమూడు వాక్యముల అర్థవివరణమే సుబోధ వ్యాఖ్యాన సారాంశము. 'ఆచార'పద నిర్వచనమును, దురాచారశిష్టాచారముల నిర్ణయమును శాస్త్రప్రమాణములతో నిర్ధారించిరి. పరాశరస్మృతి, మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, దేవలస్మృతి, శంఖస్మృతి, హారీతస్మృతి, శంకర విజయము, కూర్మ పురాణము, మార్కండేయ పురాణము, మహాభారతమునందలి అనుశాసనికపర్వము మొదలగు ఇతిహాసముల, స్మృతుల, పురాణములనుండి ప్రమాణముల గ్రహించిరి. శాస్త్రములన్నిటిని పుక్కిటబట్టిన విజ్ఞులు వీరు. అయినప్పటికి గర్వమిసుమింతయు కానరాదు. గ్రంథాది పీఠికాంతమున 'నాబుద్ధి చిన్నది, నాకు గ్రంథసామగ్రి తక్కువ; విశేషవిద్యావంతుడనుకాను; అయినను ఈ గ్రంథమును చూచువారు గుణములను మాత్రము గ్రహించి దోషముల విషయమై నాకు బుద్ధి చెప్పి దిద్దుకొను నట్లుచేసిన సంతోషించెదను' అని సవినయముగ విన్నవించిరి.

ఈనాడు రాజకీయ సభలకు అశేషప్రజానీకము వాడవాడలనుండి తండోప తండములుగ తరలివచ్చినట్లు ఆనాడు మతవిషయకములైన సభలకు అట్లు విచ్చే సెడివారు. ధర్మశాస్త్రవిషయకములైనసభలు దినములకొలది జరిగెడివి. అందలిం శాస్త్ర పారంగతులైన పండితులు పాల్గొని వాదోపవాదములు చేసెడివారు. కవిగారు శిష్టాచార దురాచారములగూర్చి జరిగిన ఇట్టి సభలలో పాల్గొని ఆ విషయ సారాంశ ములను క్రోడీకరించి ఈచిన్ని గ్రంథములను రచించియుందురు. ఈ గ్రంథము లను చూచుటతోడనే నిరసించి మూలపడవేయక గ్రంథములను సాకల్యముగా చదివి చిత్తగించగోరుచున్నాము. కవిగారి ప్రతిభావ్యుత్పత్తు లీగ్రంథగుచ్ఛమున గుబాళించుచున్నవి. వీని నాఘ్రాణించుటకైననూ నీగ్రంథములను చేపట్టక తప్పదు.

గుచ్ఛమందలి మూడవ పుష్పము 'విగ్రహారాధన తారావళి'. తారావళి యనుటతోడనే 27 పద్యములుగల గ్రంథమని తెలియుచున్నది. బ్రహ్మసమాజ ప్రచారముచే ప్రభావితులైన కొందరు పెద్దలు, సామాన్యులను పెడదారి పట్టించు

-మంత వారి ప్రబోధము నరికట్టుటకై 'విగ్రహారాధన తారావళి' రచించిరి. విగ్రహారాధనము బ్రహ్మసామాజికులకు నిషిద్ధము. కాని విగ్రహారాధనము ఉత్తమ ప్రాణికోటికి చిత్తశుద్ధి సాధనంబని తెలుపుదు సహేతుకమైన తార్కిక దృష్టితో పద్యరచన గావించిరి, తారావళిలోని నాయికామణివంటిది ఈ క్రింది పద్యము.

సీ. అమ్మాయి బొమ్మరిండ్లలికి, ముగ్గులు పెట్టి
బొమ్మలమర్చునే బుద్ధితోడ వివిధనాగరకోటి
విక్టోరియారాణి ఫొటో గ్రహించు నే బుద్ధితోడ

గీ. భూమికర్తను దానొక్క బొమ్మచేసి। కొలుచువారికినొక్కింత ఫలముకాదె
ఉత్తమ। 13 ప.

కవిగారి లోకవృత్త పరిజ్ఞానమునకు ఉపమాన సంపత్తికిని ఇది నిదర్శనము. దేవాలయములో భగవంతుని విగ్రహమును ప్రతిష్ఠించుట ఎందులకో దిగువ వివరించిరి.

సీ. కడుపులో దేవుని గట్టుదమందమా । కడుపు మూత్రపురీష కలితకుక్షి
గళమున దేవుని నిలుపుదుమందమా। గళము దుర్మాంస దుర్గంధయుతము

— — — — — —

గీ॥ దివ్యతర గోపురాచ్ఛ మందిరములోన। పావన శిలామలెందరు పరువదక్కొ
।ఉత్తమ। 16ప.

ఎంతటి వేదాంత విషయమునైనను అరటిపండొలిచి చేతబెట్టినంత సులభముగ గ్రాహ్యమగునట్లు చక్కని ఉపమానముల గుది్రగుచ్చి విశదీకరించుట వెన్నతోపెట్టిన విద్య శ్రీరాములుగారికి.

సీ. అతిచంచలునిగారననణచిపెట్టినయట్లు। దొంగగొడ్డునుదొడ్డిద్రోలినట్లు
కాచపాత్రను దీపకళిక చేర్చినయట్లు। పెట్టిలో రత్నంబు బెట్టినట్లు (ప.18)

విగ్రహారాధనము విషయలోలత్వమునుండి మరలించి యింద్రియ నిగ్రహము కలిగించునని కవిభావన. మనుచరిత్రలో ప్రవరని 'కుంభగత దీపకళిక' వలె విషయలోలుడుకాక ఇంద్రియ నిగ్రహము కలవాడని వర్ణించిరి. కుంభగతదీపకళిక గాలికి చలించదు. అట్లే కాచపాత్రయందలి దీపకళికకూడ చలించదు. కుంభము

పారదర్శకము కాదు. కాచపాత్ర పారదర్శకమేకాక అందలి కాంతి వెలుపల-గూడ ప్రసరించి చుట్టూనున్నవానిని కాంతివంతము చేసి దర్శింపచేయును. కనుక కాచపాత్రయందలి దీపకళికవలె చలించని ఇంద్రియ నిగ్రహము కలవాడు మొదటివానికన్నమిన్న. ఈతని కాంతి ప్రక్కనున్నవారిపైకూడ ప్రసరించి వారిని సహితము మనోనిగ్రహము కలవారినిగ ప్రదీపించును. అంతేగాక పెట్టెలో పెట్టిన రత్నముపట్ల ఎంతో అప్రమత్తతతో నుండవలెను. కావున విగ్రహారాధనము విషయలోలత్వమునకు లోనుగాకుండ మనోనిగ్రహముపట్ల అప్రమత్తతగ నుండునట్లు చేయును.

ఇంతటి భావము మన మనోఫలకముపై నొక్కసారి తళుక్కుమనును ఈ తారావళి యందిట్టి తళుకులెన్నో కలవు. తారావళిహారమందు తాపిన సానదీర్చిన రత్నములవంటివి ఈ గ్రంథమందలి పద్యములు.

కవిగారి బహుముఖ ప్రజ్ఞను అపారపాండితీ శేముషీ విభవమును దర్శించుటకైననూ ఈ గ్రంథగుచ్ఛమందలి మకరందము నాస్వాదించుటకైనను ప్రతి ఆంధ్రుడు ఈ గ్రంథమును పరిగ్రహింపక తప్పదు.

మహాకవి శ్రీ దాసు శ్రీరాములుగారి శాస్త్రీయ సైద్ధాంతర్యాగ పరిశీలనకు ఈమున్నుడి కరదీపికయై యొప్పారును.

డా॥ వి. వైదేహి

అత్రిభవన్
బాపట్ల

8–8–'89

శ్రీరస్తు

# దురాచార పిశాచ భంజని

సాధుపులారా! ఈ భరత ఖండమునందు నానా విధాచారములు నానాట గొన్ని కొన్ని మనకు దెలియని కారణములవలన బ్రబలి నేటివరకు జరిగి వచ్చుచున్నవి. అట్టి యాచారములలో గొన్ని కొన్ని ప్రకృతమునందు మన సంఘముల కంతగా బాధకములు కావు గాని కొన్ని మాత్రము లోక బాధకములని స్పష్టముగా చెప్పదగియున్నవి. ఇట్లు ప్రబలిన లోకబాధకములగు నాచారములు మనము వదలినగాని మనదేశము బాగుపడదు. కాని యీ యాచారములను విడుచుట మిగుల దుస్తరముగా నున్నది. ఎందుచేతననగా వేదశాస్త్రములయందు పూర్ణప్రజ్ఞ కలిగియు తామాచరించునట్టి యాచారములను ఇప్పటివాండ్రా యాక్షేపించుదురు అనెడి దురభిమానముచేత గొందరు పండితులును శుష్క వేదాంత పరులయియుండి తమ పూర్వులకు బుద్ధిలేకపోయినదా, ఇప్పటివారికిమాత్రము బుద్ధియెక్కువ వచ్చినదా యను నొక విధమయిన పూర్వాచారాభిమానముచేత గొందరు సామాన్యులును, తమకేమియు దెలియక నలుగు రెట్లు నడుచుచున్నారో అట్లే నడిచిన మేలని కొందరు పామరులును జరుగుచున్న యాచారములెంత లోక బాధకములుగానున్నను వదలజాలకుండుటయేగాక, వదలి సంచరించినవారిని సంఘములో చేరనివ్వక మిగుల చిక్కులకు లోబరుతురు. జనసంఘముతోడ మెలసి సోదరుల రీతి నైకమత్యముతో నుండదలచి పూర్వాచార విధముచేసిన యొకనికిపయిన వ్రాయబడిన బాధలవలన ఇష్టప్రామాణ్యముగలుగదు. ఐకమత్యముకొరకు ఆచార విసర్జనము, ఆచార విసర్జనముకొరకు ఐకమత్యమును గావలసివచ్చినవి. ఉన్మాద శమనోద్వాహన్యాయముగానున్నది. పెండ్లియయినగాని పిచ్చిపోదు, పిచ్చిపోయినగాని పెండ్లికాదు. అన్యోన్యాశ్రయము దోషము వచ్చినది. అయినను, ఈ భరత ఖండమునందు అది యెట్టిదైననుసరే ఆచారమును మాత్రము విడువరాదని పండితపామరులు చెప్పుచున్నారుగదా! అది న్యాయమో,

లేక, తదితరమో, మనము విచారించుకొనుట మనకు ధర్మము. మంచి చెడ్డలను విచారించుకొనక యే కార్యమునకైన పూనుట మనుష్యధర్మము కాదు. కావున, ఈ విషయమై నేను కొంత విచారించుకొనుకొని సాధ్యమైనట్టి గ్రంథ సామాగ్రి గైకొని విచారించితి. నేను వేదశాస్త్రాదులయందు ప్రమాణబుద్ధిగల యాస్తికుడనని యెంచుకొనుచున్నందున, ఇహ పరసాధనమైన యాచారములయిన యెడల విడువకయుండుటయే మంచిదియని నాకు బుద్ధివచ్చిన చిన్ననాటనుండియు నా మతమయియున్నది. అందువలననే గ్రంథ సామగ్రి సహాయమునుగొని విచారింపబూనితి. కొన్ని యాచారములు లోకబాధకములయి యున్నవి. ఈ విషయము నానాదేశ వార్తాపత్రికలఁజూచువారికందరికి విదితమేగదా! ఇట్లు లోకబాధకములయిన యాచారములను జనులు చూచి నవ్వరే. ఇందులకేమి కారణమాయని విచారించితిమా ఈయాచారములను విడువనివ్వనివారు దీనికి జెప్పెడి సమాధానమేమనిన వేదశాస్త్రాదులయందు శిష్టాచారమునకు ప్రామాణ్యమున్నదియనియు, అందువలన శిష్టాచారమును విడుచుట ఇహపర బాధకమనియు, కావున విడువరాదనియుజెప్పి, ఏ యాచారాంశమును జెప్పినను, ఇదియే సమాధానమిత్తురు. వీరు చెప్పినమాట కేవలము అసత్యముకాదు. వేదశాస్త్రములు శిష్టాచార పరిత్యాగమును నిషేధించుచునేయున్నవి. నిశ్చయము. నేను విచారించినను నా తాత్పర్యమును వారితో నేకీభవించుచున్నది. కాని అన్ని ఆచారములను శిష్టాచారములనుకొనుట మాత్రము భ్రాంతి. ఈ భ్రమ పండితులకేల కలిగెననిన అభిమానమువలన కలిగినది. అభిమానమును తెచ్చుకున్నప్పుడు తప్ప ఇతరత్ర పండితుల కజ్ఞానములేదు, జ్ఞానులే. ఈయభిమానమనునది తెచ్చుకొనవచ్చును, లేకున్న లేనేలేదు, కావున స్వపూర్వాచారాభిమానమను నొక మానసిక వృత్తినివదిలి శుద్ధాంతఃకరణులయి విచారించినచో, సత్యము తేటగాతోచును. అప్పుడు, ఎల్ల యాచారములకు శిష్టాచారములను పేరుపెట్టరు. దురభిమానగ్రస్తులు కానివారు ఏ విధమైన భ్రాంతిని పొందరు. కాని వారినే శిష్టులు, సాధువులు, సత్పురుషులు నని పిలుతురు. అట్టి సత్పురుషులనే సంబోధించి యీ చిన్న గ్రంథమును రచించుచున్నాడను.

ఈ గ్రంథముయొక్క ప్రయోజనమేమనిన వివాదమునకువచ్చిన యాచారము వర్జనీయమా, అవర్జనీయమాయని తెలిసికొనుటయే. నాబుద్ధి చిన్నది, నాకు గ్రంథ సామగ్రి తక్కువ, విశేషవిద్యావంతుడనుకాను. అయినను ఈ గ్రంథమును చూచువారు, గుణములను మాత్రము గ్రహించి, దోషముల విషయమై నాకు బుద్ధిచెప్పి దిద్దుకొనునట్లు చేసిన సంతోషించెదను. ఈ వ్రాయబోవు చిన్న పుస్తకముపేరు "దురాచార పిశాచ భంజని."

విధేయుడు

**దాసు శ్రీరాములు**

శ్రీరస్తు

శ్లో॥ ఓన్నమస్చిత్ర మహసే । జగజ్జనన హేతవే
సర్వదాఖాసమానాయ । నరాణాంజ్ఞానదాయుచ॥ ॥౧॥

శ్లో॥ ఇయం దురాచార పిశాచభంజనీ
సమస్త భూదేవమనోనురంజనీ
శృతిస్మృతి ప్రేరిత బీజభాజినీ
జయత్యజస్రం పరిపంధి బంధినీ॥ ॥౨॥

## వాక్యాని

౧. అథాచార విచారః

౨. ఆచార్లో ద్వివిధః
వైదికో లౌకికశ్చేతి
వేదాది ప్రమాణవేద్యోవైదికః
తదితరో లౌకికః,

౩. వైదిక శ్చతుర్విధః
విహితో నిషిద్ధః కలివర్జిత శ్శిష్టాచారశ్చేతి
వేదాద్యుక్తోవిహితః
తద్విరుద్ధో నిషిద్ధః
కలేరాదౌ లోకహితాయ మహాత్మభిర్నివర్తితః కలివర్జితః
స్మృత్యంతర విరుద్ధ స్మృత్యనుకూలలోకాచార శిష్టాచారః

౪. విహితస్త్వ వర్జనీయః
నిషిద్ధో వర్జనీయః
కలివర్జితాః కేచిత్కర్తృసామర్థ్యవశా
ద్వైచ్ఛికతయా వర్జనీయాః
శిష్టాచారస్త్వ వర్జనీయః

౫. లౌకికోలోక బాధకో వర్జనీయః
దాసువంశ సుధారాశి సుధాంశునా
శ్రీరామమంత్రిణా రచితేయం
"దురాచార పిశాచభంజనీ"

సమాప్తా

శ్రీరస్తు

## వివరణము
## అను వ్యాఖ్యానము

### ౧. వాక్యము - అథాచారవిచారః

ఈ భరతఖండమునందుగల పండితులు కొందరు ఎల్లయాచారములు శిష్టాచారములని భ్రాంతినొంది, కొన్ని కేవల లౌకికాచారములెంత లోకబాధకముగానున్నను విడువరాదని వక్కాణించుటయేకాక యెవ్వడైన నొకడు విడిచెనేని వానిని సంఘమున జేరనీక పలుబాములపాలు సేయుచున్నారు.

కావున ఏయాచారాంశమునైన విచారించునపుడది శిష్టాచారమా లేక కేవల లౌకికాచారమా? ఏ యాచారమైననుసరే అది విడువవచ్చునా విడువరాదా? యను ప్రశ్నలు పుట్టుచున్నవి. అట్టి యెడ ఆచారము లెన్నివిధములో వానిలో విడువదగినవి యేవో విడువరానివి యేవో యివి యంతయు వేదశాస్త్ర పురాణాదుల యర్థములను సంగ్రహించి విచారించికొనుట యుక్తము గాన, ఈ ప్రథమ వాక్యమునందు ఆచార విచారము చేయబోవుచున్నామని గ్రంథకర్త యభిప్రాయమును తెలియపరచినారు.

౨. వా॥ ఆచారో ద్వివిధః
వైదికో లౌకికశ్చేతి
వేదాది ప్రమాణ వేద్యోవైదికః
తదితరో లౌకికః॥

ఆచారము రెండు విధములుగలది.

౧. వైదికము ౨. లౌకికము

వేదశాస్త్ర పురాణేతిహాసాదులు ప్రమాణములుగా గలిగి వానివలన దెలిసికొనదగిన యాచారము వైదికాచారము. అట్టిదికాని యాచారము లౌకికాచారము.

## ఉదాహరణములు

సంధ్యావందనాదులు — వైదికములు.
వివాహాదులయందు అలకలు మొదలగునవి — లౌకికములు.

సంధ్యావందనమునకు వేదాదులయందు విధియున్నది గాన వైదికము.

శ్రు-అహరహస్సంధ్యాముపాసీత

వివాహములందు అలుకలనియెడి యుత్సవమునకు వేదాదులయందు ప్రమాణవచనములేదు గాన లౌకికము.

ప్రమాణవచనములు

హారీతస్మృతి ౧ అధ్యాయము ౨౪ శ్లోకము-
శ్రుతిస్మృతీహి విప్రాణాం చక్షుషీ ద్వే వినిర్మితే
కాణస్తత్రైకయాహీనో ద్వాభ్యామంధః ప్రకీర్తితః॥

బ్రాహ్మణునకు శ్రుతియొక కన్ను, స్మృతియొక కన్ను-రెండు కన్నులు. ఈ రెంటిలో నొకటిలేనివాడొక కన్నుగలవాడు. రెండునులేనివాడు గుడ్డివాడు. ఏ విప్రునకు రెండు కన్నులో ఆ రెండు కన్నులగు శృతిస్మృతుల విచార విషయమై విప్రుడంధుడే యగుచున్నాడు కావున విప్రుడు తన వేద శాస్త్రదృష్టులచేత జూచు నాచారములు వైదికములగుచున్నవి. చర్మచక్షువుల చేతమాత్రము జూడదగిన యాచారములు తదితరములైన లౌకికములగుచున్నవి.

మనుస్మృతి - ౧ అధ్యాయము - ౮౭ శ్లోకము

సర్వస్యాస్యతు సర్గస్య గుప్త్యర్థం సమహాద్యుతిః
ముఖబాహూరుపజ్జానాంపృథగ్కర్మాణ్య కల్పయత్.

ఈ మూవత్సృష్టియొక్క రక్షణార్థమై భగవంతుడు బ్రహ్మ, క్షత్ర, వైశ్య, శూద్రులకు వేరు వేరు ధర్మములను కల్పించెను.

ఈ యాచారములు ఇహపర సాధనములైనవి. అనగా దృష్టాదృష్ట ఫలహేతువులు వర్ణములకు వేరువేరుగా కల్పించబడినవి గాన వేదాదులచేత దెలిసికొను ధర్మములే యివి. ఇవి కానివి దృష్టఫలమాత్రహేతువులైయున్నవి. కాన భగవంతునిచే వేదములయందు చెప్పబడిన ధర్మములు కానివానిని లౌకికములని చెప్పుటయే యుక్తము.

యాజ్ఞవల్క్యస్మృతి-ఆచారకాండము. ౧౯౮ లా శ్లోకము.

తపస్తప్త్వా సృజద్బ్రహ్మ బ్రాహ్మణాన్ వేదగుప్తయే
తృప్త్యర్థం పితృదేవానాం ధర్మసంరక్షణాయచ॥

బ్రహ్మ తపస్సుచేసి వేదరక్షణకొరకును, పితృదేవతల తృప్తికొరకును వైదికధర్మముల రక్షణకొరకును, బ్రాహ్మణులను సృజించెను.

వేదోక్త ధర్మాచరణము తప్పిపోకుండ రక్షించుకొరకు బ్రహ్మబ్రాహ్మణులను సృజించెనని చెప్పియున్నందున వేదోక్తములగు యాచారములకు వేదములు ప్రమాణముకావనియు వాని సంరక్షణార్థము బ్రాహ్మణులను సృజించలేదనియును స్పష్టమగుచున్నది కాబట్టి వేదోక్తములు, ధర్మములు, దృష్టాదృష్టఫలహేతువులు, ఇవి సమానార్థములుగలవగుచున్నవి. వేదానుక్తములు, లౌకికములు, దృష్టఫలమాత్రహేతువులు, ఇవి సమానార్థకములగుచున్నవి.

కాక వేదానుక్తములను వేదోక్తములను కూడను కలిపి వైదికములు అంటిమా-బ్రాహ్మణులకు వేదశాస్త్రములను నేత్రములున్నఫలమేమి? చర్మచక్షువులేచాలును. మరియు లోకరక్షణకు బ్రహ్మవేదములను సృజించిన ఫలమేమి? లోకాచారమును విడువకుండిన చాలదా? ఇంకను బ్రాహ్మణులు వేదసంరక్షణకొరకు పుట్టినఫలమేమికలదు? దృష్టాదృష్టఫలహేతుత్వము లోకమునందు కొంతకాలము జరిగివచ్చిన యెల్లయాచారములకునువచ్చును. దాని విడిచిన పాతిత్యము కలుగవలసివచ్చును అట్లు లోకమందు మనము చూచుట లేదు.

## ఉదాహరణములు

కొన్ని ప్రదేశములయందు ఒక నూతి నీరే చిరకాలము నుండి పానము చేయు నాచారము కలదు. అంతకంటె మంచి నూతినీరు లభించినప్పుడు పూర్వపు నూతినీరు పానముచేయుట మానగూడదా? దీనికి దృష్టాదృష్ట ఫలహేతుత్వమున్నదా? అలాలేదే! దృష్టఫలమాత్ర హేతుత్వమేయున్నదే! ఇది వేదమందుగాని శాస్త్రమందుగాని చెప్పబడియుండలేదే! దీనిని వైదికాచారమని యేల చెప్పవచ్చును? సుతరాం చెప్పరాదు, ఇది వైదికేతరమనియే చెప్పవలెను.

ఈ హేతువులవలన వైదికములు, వైదికేతరములునని రెండు విధములగు నాచారము లున్నవని చెప్పుట సరిగానేయున్నది.

మనుస్మృతి-౧ అధ్యాయము-౧౦౮ శ్లోకము

ఆచారః పరమో ధర్మ
శ్శ్రుత్యుక్త స్మార్త యేవచ
తస్మా దస్మిన్ సదాయుక్తో
నిత్యం స్యాదాత్మవాన్ ద్విజః॥

ఆచారము పరమధర్మము. అది శృత్యుక్తము, స్మృత్యుక్తమమాత్రమే అయియుండును. జ్ఞానియైన బ్రాహ్మణుడు నిత్యము దానియందనురక్తుడై యుండును. ఇందువలన వైదికాచారములు వేదాది ప్రమాణవేద్యములనుట స్పష్టము.

మనుస్మృతి-౨ అధ్యాయము-౨౬ శ్లోకము.

వైదికైః కర్మభిః పుణ్యైః
నిషేకాది ద్విజన్మనామ్
కార్యశ్శరీర సంస్కారః
పావనః ప్రేత్యచేహచ.

దృష్టాదృష్ట ఫలహేతువులగు వైదికాచారములచేత బ్రహ్మ క్షత్ర వైశ్య జాతులవారికి గర్భాదానాది సంస్కారము చేయదగినది.

ఇందువలన ఉత్తమములైన మూడు వర్ణములవారికి గర్భాదానాది సంస్కారములు వైదికములయి యుండవలయుననుటచేత వైదికేతరములు కూడ నున్నవనుట స్పష్టము.

మనుస్మృతి-౨ అధ్యాయము-౯ శ్లోకము

శ్రుతిస్మృత్యుదితం ధర్మ మనుతిష్ఠన్హి మానవః
ఇహకీర్తి మవాప్నోతి ప్రేత్యచానుత్తమంసుఖం॥

వేదశాస్త్రోక్తములగు నాచారముల ననుసరించి యే మానవుడు నడుచునో వాడిహ సుఖమునేకాక పరసుఖమును కూడ ననుభవించును.

ఇందువలన దృష్టాదృష్టఫలహేతువైనది వేదాద్యుక్తాచారమనియు తదితరమటువంటిది కాదనియు స్పష్టము.

బుధధర్మ శాస్త్రము-౪౩సూత్రము

ఏవం కుర్వన్ దృష్టమదృష్టంచ ఫలంలభేత్.

వేదాది ప్రమాణవేద్యములగు ధర్మములాచరించువాడు దృష్టాదృష్టఫలభోక్తయగును.

౩. వా॥ వైదికశ్చతుర్విధః
విహితోనిషిద్ధః కలివర్జితశ్శిష్టాచారశ్చేతి
వేదాద్యుక్తోవిహితః
తద్విరుద్ధోనిషిద్ధః॥
కలేరాదౌ మహాత్మభిఃలోకో
పకారార్థం నివర్తితః కలివర్జితః
స్మృత్యంతర విరుద్ధస్మృత్యనుకూల లోకాచార శ్శిష్టాచారః

వైదికాచారము నాలుగు విధములు గలది

౧. విహితము. ౨ నిషిద్ధము. ౩ కలివర్జితము ౪ శిష్టాచారము
వేదశాస్త్రాదులు చేయవలసినదని చెప్పిన యాచారము విహితము.

వేదశాస్త్రాదులు చేయగూడదని చెప్పినయాచారముగాని, వేద శాస్త్రాదులు చేయవలసినదని చెప్పిన యాచారముల బాధించెడి యాచారముగాని నిషిద్ధము.

కలియుగాదియందు లోకోపకారముకొరకు మహాత్ములచేత నివర్తింప బడిన యాచారము కలి వర్జితము.

ఒక శాస్త్రమునకు విరోధముగానున్న మరియొక శాస్త్రముతో నను కూలించియున్న లోకాచారము శిష్టాచారము.

ఉదాహరణములు

సత్యము పలుకుట — విహితము

శృతి—సత్యంవద

అనృతమును వచించుట — నిషిద్ధము

శృతి-నానృతంవదేత్

త్రి సంధ్యలయందు నమాజ్ చెయ్యగూడదు—అని కంతో క్త్యా.

వేదాదులయందు లేకపోయినను వేదోక్తమైన—అహరహస్సంధ్యాముపాసీత-అను విధిచే నొప్పు సంధ్యావందన కర్మలోపమునుచేయును గాన నిషిద్ధకర్మయగుచున్నది.

అశ్వాలంభము — కలి వర్జితము

స్మృ॥ అశ్వాలంభో గవాలంభో
సన్న్యాసః పలపైతృకం
దేవరాచ్చ సుతోత్పత్తిః
కలౌపంచ వివర్జయేత్॥

ఊర్ధ్వపుండ్రము — శిష్టాచారము

స్మృ॥ సోర్ధ్వ పుండ్రముఖం దృష్ట్వా వ్రతం
చాంద్రాయణం చరేత్
ఇది విధించుచున్నది.

స్మృత్యంతరము॥ ఊర్ధ్వపుండ్ర విహీనశ్చేత్
సద్య శ్చండాలతాం వ్రజేత్.

ఇది నిషేధించుచున్నది. లోకాచారమున్నది-

## ప్రమాణములు

అత్రిస్మృతి మొదలగు ననేకములయందు

విహితస్యానమష్ఠానా న్నింగితస్యచ సేవనాత్

అనిగ్రహాచ్చేంద్రియాణాం నరఃపతనమృచ్ఛతి॥

విహితములు చేయకున్నను నిషిద్ధములుచేసినను శమదమాది గుణ సంపన్నుడు గాకపోయినను నరుడు పాపియగును.

ఇందువలన వైదికాచారములలో విహితములు కొన్ని, నిషిద్ధములు కొన్ని యున్నవను విషయము స్పష్టము.

మనుస్మృతి ౨ అధ్యాయము మొదలు

విద్వద్భిసేవితం సద్భిర్నిత్యమద్వేషరాగిభిః

హృదయేనాభ్యనుజ్ఞాతో యోధర్మ స్తం నిబోధత॥

ఈ శ్లోకమునకు కుల్లూకభట్టు వ్రాసిన వ్యాఖ్యానము మిక్కిలి చక్కగా నున్నది. విద్వద్భిః అనగా వేదవిద్భిః అనగా వేదార్థము నెరిగినట్టియు సద్భిఃధార్మికైః అనగా విహితాచార సంపన్నులు, నిషిద్ధాచారరహితులు నైనట్టియు, అద్వేషరాగిభిః రాగద్వేషాది రహితులైనవారివలన సేవితః అనుష్ఠితః ఆచరించబడునట్టియు, హృదయేసాభ్యనుజ్ఞాత, మనోభి ముఖ్యేన జ్ఞాతః మనునుచేత తెలిసికొనబడినది యేదో అదియేధర్మమని వ్రాసినారు. అనగా వేదశాస్త్రముల యందేది చేయదగునని చెప్పియున్నదో దానిని చేయవలయును. ఏది నిషేధింపబడినదో యది చేయగూడదని పర్యవసితమైన యర్థము. ఈ యర్థమే యీ యధ్యాయమందు ౧౧ శ్లోకములవరకు స్పష్టముగా తేట పరచబడినది. ఈ ౧౧ శ్లోకములవలనను వేదశాస్త్రాదులయందు చెప్ప బడిన ధర్మములే వైదికములనియు, అవియే దృష్టాదృష్ట ఫలసాధకము లనియు అందు విహితాచరణము చేయవలయుననియు నిషిద్ధాచరణము త్యజింపవలయుననియుం జెప్పంబడియున్నది. గ్రంథవిస్తర భీతిచే వ్రాయ లేదు. ఇకను కలివర్జితముల విషయమై వ్రాయబోవుచున్నాడను. ఈ కలి

వర్జితములు వేదశాస్త్రములయందు చెప్పబడిన పద్ధతికి విరుద్ధముగా కలియుగమునందాచరణకు యోగ్యములయిన యాచారములు. వీని విషయమై వృద్ధ పారాశరమను ధర్మశాస్త్రము యావత్తును తేటతెల్లముగా వర్ణించుచున్నది. ఆ శ్లోకములన్నియు నిచ్చట వివరించుట యావశ్యకముగా తోచలేదు.

కైలాస శిఖరేరమ్యే అను మొదటి శ్లోకము మొదలు-

ఇమేధర్మాః కలియుగే వర్ణసంకర భీతితః
- వర్జనీయాః ప్రయత్నేన పరలోక మభీప్సుభిః
అను ౪౯ శ్లోకమువరకు చూడదగినది.

ఇకను ముఖ్యమైన శిష్టాచార విషయమునుగూర్చి వ్రాయుచున్నాను. ఈ శిష్టాచారమును ఈ క్రింది పదములచేత వాడుచున్నారు. శిష్టాచారము, సదాచారము, వృద్ధాచారము, పిత్రాచారము, లోకాచారము, లోకసంగ్రహము, దేశాచారము, కులాచారము, మొదలగునవి. ఈ శిష్టాచారము శృతి స్మృతి ప్రమాణరహితమైనదికాదు. అట్లయిన యెడల మనుస్మృతి వ్యాఖ్యాతయగు కుల్లూకభట్టు మనుస్మృతి ౨ అధ్యాయము, ౧౩ శ్లోకార్థము వ్రాయుచో వ్రాసిన 'అప్రమాణ మనాదరణీయమ్' అను వాక్యమున కర్థమేలేకపోవును. ఏ యాచారముగాని ప్రమాణసహితమై యుండవలయును. అట్లు ప్రమాణములేని యాచారము నెవ్వరాదరింతురు? కావున శిష్టాచారమును, వైదికాచారమేయయి యుండవలయును. వైదికాచారమనగా వేదాది ప్రమాణవేద్యము-వేదాది ప్రమాణమలేయుండగ శిష్టాచారమని పేరుపెట్టి అందువలన నొక భేదముకల్పించుట కేవల నిమిత్తమనిన స్మృతులలో నొకదానికొకటి విరోధించియున్నప్పుడు గతిలేకపోయినందున, లోకాచారమే స్మృతితో నమకూలించియుండునో యాస్మృతవాక్యమునకును, ఆ స్మృతివాక్యముతో ననుకూలించియుండు లోకాచారమునకును ప్రామాణ్యము చెప్పవలసి శిష్టాచారమునుకూడను ప్రమాణముగా మహర్షులే గ్రహించినారు. స్మృతులకు తుల్యబలము సంభవించినప్పుడు ఆచారమునకు విచికిత్స కలుగనే కలుగదు. ఆచారమునకు విచికిత్స కలిగినప్పుడే శిష్టాచారమునకు ప్రామాణ్యము.

## తైత్తిరీయోపనిషత్తు-శిక్షావల్లి

యాన్యనవద్యాని కర్మాణితాని సేవిత వ్యాని నో
ఇతరాణి— యాన్యస్మాకగ్ం సుచరితాని తానిత్వయో
పాస్యానినో ఇతరాణి.

ఈ శృతివలన విహితాచారములు చెప్పబడినవి-ఇవి తప్ప మరియొక యాచారము చేయగూడదని స్పష్టముగా జెప్పబడియున్నది. అదేప్రకారము "నో ఇతరాణి"యనుటవలన నిషిద్ధము లాచరించరాదనియు దెలియవచ్చు చున్నవి.

## పై యుపనిషత్తు తరువాయి

అథ యది తే కర్మవిచికిత్సావా వృత్తవిచికిత్సా
వా స్యాత్ యేతత్రబ్రాహ్మణాస్సంమర్శినఃయుక్తా
యుక్తాః అలూక్షాధర్మకామాస్స్యుః-యథా తే తత్ర
వర్తేరన్-తదా తత్రవర్తేథాః

దీనివలన ఎప్పుడయిన ఆచార సంశయము కలిగినప్పుడు వేదార్థ విదులగు బ్రాహ్మణు లచట నెట్లు ప్రవర్తించుచున్నారో యట్లు ప్రవర్తించుమని చెప్పబడియున్నది. కావున విహితము లాచరించుము-నిషిద్ధము లాచరింపకు-విహితమా? నిషిద్ధమా? యను సంశయము కలిగినపుడు అచ్చట ధర్మము లెరిగిన బ్రాహ్మణులు ప్రవర్తించినరీతిని ప్రవర్తించుము-అని చెప్పినందును వైదికాచారమయియుండి, యొకస్మృతి విహితమని యొక స్మృతి నిషిద్ధమని చెప్పినవిషయములోనే సదా సంశయముపుట్టును. అట్టి సమయమునమాత్రము శిష్టాచార మేలాగో ఆలాగు ప్రవర్తింపవలయునని చెప్పియున్నది.

## మనుస్మృతి - ౨ అధ్యాయం-౧౪ శ్లోకం

ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం
శృతిః శృతిద్వైధంతుయత్రస్యాత్
తత్ర ధర్మావుభౌస్మృతౌ ఉభావ విహితౌ ధర్మౌ
సమ్యగుక్తౌమనీషిభిః॥

దీనికి వ్యాఖ్యాతలు వ్రాసిన యర్థమునుబట్టి విచారించిన ధర్మ విచికిత్స కలిగినప్పుడు ప్రథమ ప్రమాణము శృతి-శృతికి శృతికి విరోధము కలిగినప్పుడు వికల్పముచే రెండును గ్రాహ్యములు—శృతికి స్మృతికి విరోధము కలిగినప్పుడు శృతియే ప్రమాణము. శృతికి స్మృతికి విరోధము కలిగినప్పుడు ఆయాచారమునకు శృతియున్నప్పుడు శృతికి ప్రమాణము శృతిలేనప్పుడు ఏ స్మృతితో శిష్టాచారమనుకూలించునో యది ప్రమాణము. ఇంతకంటె మరియొకవిధముగా చెప్పుటకవకాశము తోచలేదు.

పులస్త్య స్మృతి-౧౨-౧౬-౧౪-౧౮-౧౯ శ్లో॥

విజ్ఞాన సాధ్యతా సర్వాధర్మో యం వర్ణలింగిదాం
అదృష్ట ఆదిమప్రోక్తో దృష్టోధర్మో ద్వితీయకః॥
ఉభయార్థ స్మృతీయశ్చ న్యాయుమూల చతుర్థకం
ఉభయవ్యవహారశ్చ దండధారణమేవచ॥
తుల్యార్థానాం వికల్పస్స్యా న్న్యాయమూలః ప్రకీర్తితః॥
వేదేతువిదితోధర్మః స్మృతౌదర్శితఏవహి॥
అనువాక స్మృతిసూక్త కావ్యార్థా ఇతిమానవాః।
గుణార్థ పరిసంఖ్యాతో బాంధవాదౌ విశేషతః॥
విశేషదృష్ట ఏవాసౌ ఫలార్థ మితిమానవాః
తదర్థశ్చ ప్రయాసోయః సచసేవ్యః ఫలార్థినా॥
ఉక్తః పంచవిధోధర్మః శ్రేయోభ్యుదయహేతుకః।
పురుషాణాం యథాయోగం । సచసేవ్యః ఫలార్థినా॥

ఈ శ్లోకముల యర్థము పూర్ణముగా గ్రహించిన యెడల యిదివరకు నేను వ్రాసిన యావద్వ్యాఖ్యార్థము సరియయినదని గ్రహించవచ్చును.

౪—వా॥

విహితస్స్వ వర్జనీయః
నిషిద్ధో వర్జనీయః
కలివర్జితాః కేచిత్కర్తృ సామర్థ్యవశా ద్వై
చ్ఛిక తయా వర్జనీయాః।
శిష్టాచార స్త్వవర్జనీయః।
లౌకికో లోకబాధకోవర్జనీయః॥

విహితములు వర్జించరాదనియు నిషిద్ధములు వర్జించదగినవనియు చెప్పినదానినందరు నంగీకరింతురు, ఇందుల ప్రమాణము లిదివరకు వ్రాసి నవేచాలును. కలి వర్జితములనుగూర్చియు, శిష్టాచారములనుగూర్చియు మాత్రము వివరముగా వ్రాయవలసియున్నది. వాని రెంటిని రెండు ప్రక రణములనుగా వ్రాయుచున్నాడను. లౌకిక మప్రమాణమై దృష్టఫలమాత్ర హేతువయియున్నది గాన లోకబాధకమైనపుడు వర్జనీయమే యనుట వేరే చెప్పవలసినదిలేదు. ఇందుల ప్రమాణము లిదివరకు వ్రాసినవేచాలును. అయినను ప్రస్తుతము లోకబాధకములుగానున్న లౌకికాచారములు తుదను వ్రాయబడును.

## కలివర్జితాచార విషయము

కలివర్జితాః కేచిత్కర్తృ సామర్థ్యవశాదైచ్ఛి
కతయా వర్జనీయాః॥

కలివర్జితములు కొన్ని కర్తృసామర్థ్యమువలన ఇష్టమువచ్చిన మాన వచ్చును అని గ్రంథకర్త చెప్పినదాని ప్రామాణ్యమును కనుంగొనుటకు ముందు చూడవలసిన యంశములు.

౧. కలివర్జితాచారము లేవి?
౨. వానిలో విడువరానివి యేవి?
౩. విడువదగినవి యేవి?
౪. కొన్ని విడువదగినవి, కొన్ని విడువరానివి యనుటకు
నిమిత్తములేవి?

మొదటియంశము కలివర్జితములేవి-యనుటకు ప్రమాణ గ్రంథములు వృద్ధపారాశరము, బృహన్నారదీయము, ఆదిత్య పురాణము మొదలగునవి.

ఈ శ్లోకములన్నియు నుదాహరించుట గ్రంథవిస్తరభీతిచే మానితి. కాని వీనియన్నిటివలన తేలిన కలివర్జితాచారముల నన్నిటిని ఈ దిగువ నుదాహరించెదను. ఈ కలివర్జితములను రెండు విధములని చెప్పవచ్చును.

౧ నిషిద్ధ క్రియాకలివర్జితములు
౨. తదితరములు

## నిషిద్ధ క్రియా కలివర్జితములు

౧. దేవరాత్సుతోత్పత్తి ౨. దత్తాపునర్దానము ౩. క్షతయోని సంస్కారము ౪. సవర్ణ దుష్టాసంగమము ౫. అయోగ్యా సంసర్గము ౬. ప్రజార్థమై పరదార పరిగ్రహము ౭. విధవావివాహము ౮. మధుపర్కమందు పశువధ ౯. శ్రాద్ధమందు మాంసదానము ౧౦. గోమేధము. ౧౧. నరమేధము ౧౨ అశ్వమేధము ౧౩. పశూపాకరణము. ౧౪. సురాగ్రహణము.

## తదితరములు

౧౫. అసవర్ణ కన్యావివాహము ౧౬ వాన ప్రస్థాశ్రమము. ౧౭. సముద్రయానము- ౧౮ కమండలు ధారణము. ౧౯. దీర్ఘకాల బ్రహ్మచర్యము. ౨౦. ఆతతాయి ద్విజధర్మయుద్ధహింసనము. ౨౧. శస్త్రదీక్ష ౨౨ లీథాపరిగ్రహము- ౨౩. ఆశౌచ సంకోచము. ౨౪. వృత్తస్వాధ్యాయసాపేక్ష ౨౫. విప్రునకు మరణాంతిక ప్రాయశ్చిత్తము ౨౬. సంసర్గదోషము ౨౭. మహాపాతకప్రాయశ్చిత్తము ౨౮. పరోద్దేశము వలన నాత్మత్యాగము ౨౯ అస్థి సంచయమునకు తరువాత నంగస్పర్శము. ౩౦ సోమవిక్రయము. ౩౧ అశ్వస్థనికత ౩౨ ఆపద్వృత్తి ౩౩. ద్విజులకు నిత్యసంచారము ౩౪ యతికి సర్వవర్ణములయందు భిక్షాచర్య ౩౫. నవోదకాచమనము ౩౬ గురుచోదిత దక్షిణ ౩౭ భృగ్వగ్నిమరణ ప్రాయశ్చిత్తము ౩౮ గోత్ప్రాప్తి శిష్టోదకాచమనక్రియ ౩౯ సన్యాసము ౪౦ అసవర్ణసుతులకు విభాగ విషయము ౪౧. దత్తౌరసేతర పుత్ర పరిగ్రహము ౪౨ అసగోత్రుని యుపనయనానంతరము పుత్రునిగా స్వీకరించుట ౪౩. బ్రాహ్మదైవార్షములుతప్ప తక్కిన వివాహములు ౪౪ కర్మనిష్ఠునికే కాహశ్శుద్ధి ౪౫ ఔరసుడు పుట్టినతరువాత దత్తునకు జ్యేష్ఠత్వము ౪౬ దత్తుడుండగా నితురుని స్వీకరించుట. ౪౭ స్త్రీ స్వాతంత్ర్యము ౪౮ ఉద్ధారాంశము. ౪౯ ద్వ్యాముష్యాయణభేదములు. ౫౦ దత్తపుత్ర భేదములు.

ఈ యేబది యాచారములు కలివర్జితములుగా గానవచ్చుచున్నవి.

రెండవ యంశము వీనిలో వర్జింపరానివి యేవి యనునది. మొదటి నదునాలుగును -౨౩-౪౩-౪౪-సంఖ్యలు గల యాచారములు వర్జింపరానివి.

మూడవ యంశము-వీనిలో తక్కినయన్ని యాచారములును వర్జింపదగినవియే.

నాల్గవది-ఇందునకు నిమిత్తమేమి యనునది.

విడువరాదన్నందుకు నిమిత్తము - సామాన్యముగా నిషిద్ధమైన యొక క్రియకు కృత త్రేతా ద్వాపరములయందు మాత్రము క్వచిదభ్యనుజ్ఞ కలిగినయెడల దాని నిషిద్ధత్వము కలియుగము నందట్టి యున్నది గాన అనిష్టప్రాప్తి హేతువగుచున్నది. కాబట్టి యట్టి కలివర్జితాచారము నాచరించెనేని, యాక్రియకుందగిన ప్రాయశ్చిత్తమునగాని పవిత్రుడుగాడు—అట్లు పవిత్రుడుగాకుండెనేని నరకప్రాప్తి సిద్ధము విడువరానందున కిదియే నిమిత్తము.

ఉదాహరణములు :- గోవధసామాన్యముగా నిషిద్ధక్రియ నీనికిమధుపర్కమందు కృతత్రేతాద్వాపరములలో అభ్యనుజ్ఞకలదు. కలియుగమందు లేదు. దాని నిషిద్ధత్వము కలియుగమునందట్టే యున్నది కాబట్టి కలియుగమునందు మధుపర్క గోవధ నిషిద్ధమే—గోవధాప్రాయశ్చిత్తము తప్పదు.

అశౌచసంకోచము కర్మానుష్ఠాన బాధకముగాన నిషిద్ధము—సర్వత్ర యిదే విధముగా తెలుసుకోదగినది.

---

• ఈ గ్రంథమందు కలివర్జిత సంకేతము క్రియకు కాదు. క్రియానివృత్తికని సర్వత్ర తెలిసికొనదగినది. ఉదాహరణము :- సముద్రయానము, క్రియ సముద్రయాననివృత్తి, కలివర్జితము : ఇట్టే తెలిసికొనదగినది.

విడువదగినందునకు నిమిత్తము :- నిషిద్ధేతరక్రియలు అనిష్ట ప్రాప్తి హేతువులు కావు గావున, వానికి ప్రాయశ్చిత్తము కానరాదు గావునను, అసమర్థులను రక్షించుకొరకు మాత్రమే కలియుగమునందు వర్జించబడినవి గావునను సమర్థులైన వారాచరించిన బతితులు కాజాలరు.

ఉదాహరణము! గురుచోదిత దక్షిణ కలివర్జితము. ఇది నిషిద్ధ క్రియ కాదు — ఈ క్రియ అనిష్టప్రాప్తి హేతువుకాదు. దీనికి ప్రాయశ్చిత్తము కానరాదు. గురువడిగినంత దక్షిణ శిష్యుడిచ్చుట కలియుగ మందు దుస్తరమైనని మహాత్ములు కృపచేత వర్జించినారు గాని సమర్థుడుండి యివ్వగలిగిన నివ్వరాదనుకాదు.

కాబట్టి యిట్టి కలివర్జితములు సమర్థులగు వారిచ్చ వచ్చెనేని వర్జింప వచ్చునని గ్రంధకర్త తాత్పర్యము. వర్జింపదగిన కలివర్జితాచారములలో గొన్నిటికి దృష్టాంతములు మొదలగునవి తెలియచేయుట యావశ్యకమని తోచి వ్రాయుచున్నాడను.

సన్యాసము :- ఈ సన్యాసమును గాశము కలివర్జితము. కలి వర్జితమైనందునకు వృద్ధపారాశరమనుస్మృతి ప్రమాణము. కాని సన్యాసా శ్రమము వేదశాస్త్రములయందు విహితముగా జెప్పబడినది గాని నిషిద్ధము కాదు. సన్యాసాశ్రమాలవంబిక ప్రాయశ్చిత్తము విధించబడలేదు సన్యాసాశ్రమము నరకప్రాప్తికి హేతువుకాదు అనునది యెల్లరకు విదితమే ఈ యంశములు వర్జనియములని గ్రంథకర్త తెలియచేసిన కలివర్జితాచారములకన్నిటికిని యున్నవి యని ముందే చెప్పబడినది వయిగా యీ సన్యాసాశ్రమము నేటివరకును బ్రహ్మణులాచరించుచునే యున్నారు. ఆది శంకరులవారుపునరుద్ధారణముచే యునేచేసినారు. ఇదిగాకయతికి సర్వవర్ణముల యందు భిక్షాచర్యనుగూడ కలివర్జితములలో చేర్చినందున యతి కలి యుగమునందు కలడనియెడు అంశము వేరే చెప్పనక్కరలేదు.

వృద్ధపారాశరము ౨౧ శ్లోకము
యతేస్తు సర్వవర్ణేషు భిక్షాచర్య విధానకం.

కావున సమర్థుండగువాడు సన్యాసాశ్రమమును స్వీకరించవచ్చునని వర్యవసితమగుచున్నది.

వానప్రస్థాశ్రమము :- ఈ వానప్రస్థాశ్రమ మనగా గృహస్థాశ్రమానంతరము పుత్రునకుగాని భార్యకుగాని గృహమువదలి, వనమునాశ్రయించి యాటవిక పదార్థములు భుజించుచునుండుట - ఇట్టివాని హిమాలయప్రాంతముల యందును పశ్చిమసముద్రతీర వాసులలోను నేటికి బహుక్షత్రులాచరించుచునే యున్నారు. ప బునసన్యాసమునకు వ్రాయబడిన మొదటి హేతువు లన్నియు దీనికిని సమానములే.

దీర్ఘకాలబ్రహ్మచర్యము :- దీర్ఘకాలము బ్రహ్మచారులుగా నున్న బ్రాహ్మణులిప్పుడెందరులేరు? వివాహప్రాప్తి లేకపోయిన బ్రాహ్మణులు బ్రాహ్మణులు కాకపోదురా? కావున దీని విషయమై మిక్కిలి విచారించ వలసిన పనికా దు

అపవర్ణకన్యావివాహము :- భర్తృహరి, విక్రమార్కుడు, భట్టి, వరరుచి వీరు నలుగురును బ్రాహ్మణ పుత్రులయినది యందరికినిదెలిసిన యంశమే. వీరల తండ్రి నాలుగు వర్ణముల వారిని వివాహము చేసుకొనియె నని చరిత్ర వినుచునే యున్నాము. శాలివాహనుడు బ్రాహ్మణునకును కుంభకార స్త్రీకిని బుట్టినవాడు-కృష్ణరాయలు గవలసంగామను వివాహము చేసికొనినది వినుచున్నారము. ఇవియన్నియు కలియుగ వృత్తాంతములు కావా? కావున ఈ విషయమైయింతియే చాలును.

మరియు అపవర్ణక స్త్రీ సంతానమునకు విభాగ వైషమ్యము కలి యుగవర్జితముగా చెప్పబడినందున అసవర్ణకన్యా వివాహము కలియుగ మందుగలదు కావుననే తత్సంతానమునకు విభాగ వైషమ్యము వర్జింపబడి నదని తెలిసికోదగినది.

వృద్ధపారాశరము ౨౭ శ్లోకము
తథా సవర్ణ పుత్రాణాం విభాగ విషమోపిచ

బ్రాహ్మణుడు శూద్రస్త్రీని వివాహము చేసుకొనుటమాత్రము దూష్యము పరాశరస్మృతి ప్రాయశ్చిత్త కాండము జూడుము.

దత్తౌరసేతర పుత్రపరిగ్రహము ; మైథిలేయులయందు కృత్రిమ పుత్రపరిగ్రహము నేటికిని జరుగుచున్నది.

క్షేత్రజపుత్రుడు వ్యభిచారనిషిద్ధుడుగాన తదంగీకారము కూడదు. ఈ విధముగానే కుండుడు గూఢోత్పన్నుడు సహోఢుడు, పౌనర్భవుడు దూష్యులు,నిషిద్ధవివాహజాతుడుగాన పారశవుడు దూష్యుడు.పరవిక్రయము దూష్యము గాన క్రీతుడు దూష్యుడు. ఔరసదత్తులు గాక అపవిద్ధ స్వయం దత్త కృత్రిములు గ్రాహ్యులు దాయార్హత మొదలగువ్యవహార విషయము లెట్లున్నను, అటువంటి పుత్రులచ్చటచ్చట కావవచ్చుచునేయున్నారు.

సముద్రయానము :- ఇది సామాన్యముగా నిషిద్ధేతర క్రియగాని, నిషిద్ధక్రియకాదు. కాని కలివర్జితములలో జేర్పబడినది. వృద్ధపారాశరము లో శ్లోకము! "సముద్రయాన స్వీకారః కమండలువిధారణం" అనియున్నది. ఒక వేళ సముద్రయానముచేసిన ద్విజునకు పరకప్రాప్తి కలదేమోనని విదారించిన నెచ్చటను గానం బడలేదు-ప్రాయశ్చిత్త విధానము గమ పడదు. సముద్రయానాచారమున్నట్లు మహానుభావులైన మాధవాచార్యుల వారు తన పరాశరమాధవీయమునందు మాతులకన్యావివాహమున కాచార మును గనపరచుచు బోధాయనవచనము నుదాహరించి వ్రాసినారు.

## బోధాయన వచనము

శ్లో॥ పంచధావిప్రతిపత్తిః దక్షిణతఅనుపనీతే
సభార్యయా సహభోజనం ....... పర్యుషిత
భోజనం మాతుల దుహితృపితృష్వ దు
హితృపరిణయనమితి తధోత్తరత్— ఊ
ర్ణవిక్రయశ్శీధుపానము భయతోదద్భి ర్వ్యవ
వహార ఆయుధీయకం సముద్రయానమితి

శీధుపానాచారము కూడ నున్నట్లు వ్రాయబడినదేయని యడిగిన నిషిద్ధాచారమున్నను, అది సర్వదా వర్జనీయమేనని సిద్ధాంతవాక్యముచే గ్రంథకర్త వక్కాణించియున్నారు గానఆవిచారమునకుం బనిలేదు. సముద్రయానము నిషిద్ధేతరముఁగాక కలివర్జితమైనను బాధకములేదు. హేతువులిది వరకే సవిస్తరముగా జెప్పబడియున్నవి. ఇప్పుడీ బోధాయనవచనము వలన ఆచారముఁమ మాత్రము గనపరచినాడను. సర్వత్రవర్జనీయా వర్జనీయ కలివర్జితాచార విచార మీ విధమున జేయదగినది.

### శిష్టాచార విషయము

శిష్టాచారస్త్వవర్జనీయః

శిష్టాచారము వర్జింపరాదనుటను సమస్త పండితులు నొప్పుకొనుచునే యున్నారు. శిష్టాచారమనగా — స్మృత్యంతర విరుద్ధస్మృత్యనుకూల లోకాచారము, అని జ్ఞాపకముంచుకొని యే యాచారమునైనను శిష్టాచార లక్షణ లక్షితమని యెంచుకొంటిమా దాని వర్జింపనేరాదు.

ఈ విషయమై ప్రమాణవచనములు

మనుస్మృతి ४వ అధ్యాయము

యే నాస్య పితరోయాతాః యేణయాతాః
పితామహ తేనయాయాత్సతాం మార్గం
తేవగచ్ఛన్నిరిష్యతే

ఆపస్తంబ సూత్రము

యథా వైషా కులధర్మస్స్యాత్

విష్ణుస్మృతి

శాఖాం పుంద్రించ సూత్రంచ సమయా
చారమేవచ పూర్వైరాచరితం కుర్వా
దన్యథాపతితో భవేత్

యల్లాజీయము

పారంపర్యాగతమే ధర్మంయో నరస్త్యక్తుమచ్ఛతీత్యాది

లౌకికాచార విషయము

లౌకికో లోకబాధకో వర్జనీయః

ఈ భరతఖండమందనేక లౌకికాచారములున్నవి. వీనికి వేదశాస్త్రాది ప్రమాణములు లేవు. గనుక యెంతవరకు లోకబాధకములు కావో అంత వరకు జరగవచ్చును. యెప్పుడు లోకబాధకములుగా నుండునో అప్పుడు మానవచ్చును. వివాహముల యందు అలుకలు, ఎదిరికోళ్లు చూర్ణోత్ప వాదులు లోకబాధకములుగా ప్రకృతమందు దోచబడుటలేదు. గావున వానిని మానవలసిన యావశ్యకతలేదు. వినోదార్థములుగా మండనిమ్ము కొన్ని యాచారములు లోకబాధకములుగానున్నవే వానిని మాత్రము వర్జింపుడు- అని గ్రంథకర్త యభిప్రాయము. ప్రస్తుతము లోకబాధకములుగా నున్న కొన్ని లౌకికాచారములను వివరించెదను.

౧ కొన్ని చోట్ల స్మార్తులలో నాడు భేదములు

౨ నియోగి, వైదిక భేదములు

౩ కులాభిమానములచే సవర్ణులలో నొకరి నొకరు నీచులుగా చూచుకొనుట

౪ వివాహాదులయందు సంభావనలకని బ్రాహ్మణులు మొదలగు వారు యజమానుల బీడించుట

౫ ఆహారయోగ్య ధాన్యాదుల యందారోగ్యమును విచారించక మృదుత్వాదుల కిచ్ఛయుంచుట.

౬ కొన్ని ప్రదేశములయందు విందులకు గృహస్థులు తాము స్వయంగా బోయి పిల్చు విధులు - నృత్య, గీత వాద్యాదులతోబోయి పిల్చు విధులు.

౭ దీపావళికి విశేష ద్రవ్యము వెచ్చములేసి మందు కాల్చుట.

౮ స్త్రీలకు విద్య నేర్పకుండుట.

౯ అతి బాల్యమునందు వివాహము సేయుట

౧౦ అత్తలు కోడండ్రయందు మిక్కిలి కఠినవృత్తి చూపుట.

౧౧ స్త్రీలను గృహము బయటకానివ్వక గదులలో మూసిపెట్టుట.

౧౨ వెనుకముందు లాలోచింపక స్త్రీల కాభరణములు చేయించుట.

౧౩. స్త్రీల కనావశ్యకములగు కర్ణ, నాసికావేధలు సేయించుట.

ఈ మొదలగు నాచారములు లోకబాధకములు గాన వర్జింపదగినవి.

విధవా బ్రహ్మచర్యము శిష్టాచారమనియెడి పక్షమందునను కలివర్జితమనియెడు పక్షమందునను గూడ విడువదరుచున్నది. కలి వర్జిత పక్షమున వ్యభిచార మనియెడు సామాన్య నిషేధమువల్ల బాధింపబడినది గాన నిషిద్ధమైనది. కాని యాజ్ఞవల్క్య స్మృతియందు!

శ్లో॥ కర్మణామనసావాచాయత్నాద్ధర్మం సమాచరేత్
అస్వర్గం లోకవిద్విష్టంధర్మమప్యాచరేత్॥

అని చెప్పబడియుండుటచేత అట్లీచేయువాడుఅంతగా దూష్యులగుదు రని తోచదు.

లోకములో నానాట ప్రబలిన దురాచారములను తెలిసికొని యున్నట్టి వారినెల్ల జనులు తృణింపవలయునని యుద్దేశించి యనేక శాస్త్రములు పరిశీలించి గ్రంథకర్త తమ యావత్తు తాత్పర్యమును నాలుగు వాక్యములలో నిమిడించి యీ గ్రంథమును రచించినారు. వారి తాత్పర్యమును వారి సాన్నిధ్యముననే గ్రహించి తదనుమతిచే నేనీవివరణమును వ్యాఖ్యానమును రచించినాడ. తప్పులున్న క్షమింపుడు.

చ॥ చారుగుణజ్ఞుడై నిఖిలశాస్త్రసమన్వయదక్షుడై మహో
దారమనీష లోకహితతత్పరుడై యల దాసువంశ వి
స్తారుడు రామమంత్రి ఘనచాతురి బల్కినయట్టి యీ దురా
చారపిశాచభంజనికి సల్పితినివ్వివరాఖ్య వ్యాఖ్యగాన్॥

క॥ శ్రీరాముని మేనత్త కు
మారుడ దన్నిత్యసంగమాన్యుండ దురా
చార పిశాచారి వ్యా
ఖ్యారచనుడ నుప్పలూరి కనకాఖ్యకవిన్॥

వివరణము

అనువ్యాఖ్యానము — సమాప్తము

శ్రీ

శ్రీ ర స్తు

# ఆచారనిరుక్తి

సాధువులారా !

ఈ భరతఖండమునందు గల సమస్తవర్ణములవారును సదాచార సంపత్తి గలవారై యుండవలసినది గదా. ఇది అందరును సమ్మతించెడి యంశమే. కాని ఆచార మనగానేమో, ఆచారపదార్థ మెప్పుడేమిగా నుపయోగించుకొన వలయునో, యిదిమాత్రము అందరికిని దెలసియున్నదని నేను జెప్పజాలను. ఎందువలనననిన ఆచార పదమునకు ఇప్పటి సామాన్యులందరును రెండు విధములైన యర్థములు చేసికొనుచున్నారు. అవియేవనగా :-

1. తండ్రితాతలు, గ్రామములోనివారు, దేశములోనివారు, ఒక సంఘము లోనివారు, ఆచరించినదేదో అది ఆచారమని,

2. కాళ్ళు, చేతులు, పాత్రలు, ఇల్లు, పరిశుభ్రముగా నుంచుకొనుట, బహిర్భూమికి దూరముగా విడుచుట, శూద్రాదులను ముట్టకుండుట, ఇవి మొదలగు నటువంటి పనులు ఆచారములని.

ఈలాగున లోకమున రెండువిధములగు నర్థములు వాడుకలో నున్నందునకు రెండుదాహరణములు వ్రాయుచున్నాడను.

మొదటి అర్థమునుగూర్చి యుదాహరణము

ఒకడు మరియొకని ప్రశ్న యడుగుచున్నాడు "మీ గ్రామములో మీరు నూతి నీళ్ళుపయోగించుట యాచారమాలేక చెరువునీళ్ళుపయోగించుట యాచారమా ?" మరియొక డుత్తరమిచ్చుచున్నాడు "మా యూరిలో కాలువ నీరుపయోగించుకొనుట యాచారము." ఈ ప్రశ్నోత్తరములలోని ఆచారపదములకు-

తెలుగులో - కాణాచి - వాలాయము
హిందుస్థానిలో - మామూలు
ఇంగ్లీషులో - కస్టమ్
ఈ యర్థము వచ్చుచున్నదిగదా.

ఇకను రెండవ యర్థమును గూర్చి యుదాహరణము

ఒకడు మరియొకని ప్రశ్న వేయుచున్నాడు. "ఏమయా చేతులు కాళ్ళు కడుగుకొనకనే భోజనము చేయుచున్నావు ? ఆచారములేదా !" మరియొకరుత్తర మిచ్చుచున్నారు "పరదేశములో మార్గమధ్యమం దేమియాచారమయ్యా?"

ఈ ప్రశ్నోత్తరముల యందు ఆచార పదములకు

| | |
|---|---|
| తెలుగులో | మడి |
| హిందుస్థానిలో | పాక్ |
| ఇంగ్లీషులో | క్లెన్లినెస్. |

ఈయర్థము వచ్చు చున్నది గదా.

ఇంత మట్టునకు సర్వత్ర సర్వజనులు వాడుకగా జేసుకొనుచున్న యర్థములు.

ఇకను ఆచారపద విషయమై పూర్ణముగా విచారించని పండితుల నడిగి బోయినవారు నానా విధార్థములు చెప్పుదురు :-

1. పిత్రాచారము, కులాచారము, దేశాచారము, వృద్ధాచారము, మతాచారము, శిష్టాచారము నని
2. శౌచా చారమని
3. కర్మయని.
4. ధర్మమని
5. ఆచరించ బడునది యంతయునని,

ఈలాగున నానా విధముల పండితులు అర్థములు చెప్పుచున్నట నేనెరిగి యున్న వాడగానదినికితరులు కూడ స్వానుభవ ప్రమాణము చేతనే యంగీకరింతురని నమ్మెదను, లేదా ఇప్పుడెవరైననొకరొక పండితునిజూచినప్పుడు ఆచార పదమున కర్థమేమని యడుగవచ్చును. వారు చెప్పిన యర్థమును ఒక పుస్తకమందు వ్రాసికొని మరియొక పండితుడు వచ్చినప్పుడా పండితుని యడిగితిరా తప్పక ఆయన మరియొక యర్థము చెప్పును ఇట్లుగానే యెందరి నడిగిన నన్ని యర్థము లేర్పడును. కొందరా విషయమై విచారించవలెనందురు. అయా యర్థ

ములు చెప్పిన వారిని ప్రమాణవచనములడిగితిమా చెప్పిన ప్రమాణవచనములకు తాము చెప్పిన యర్థము వచ్చునట్లెదో చెప్పి సమాధానపరతురు. కాని లౌకిక మందు ఆచారపదమున కెన్నియర్థములు చెప్పుకొని యెట్లు వాడుకొన్నను శాస్త్రాదుల యందు ఆచారపదమునకు నానావిధార్థము లున్నవని చెప్పునెడల ధర్మశాస్త్రములకు అర్థముచేయుటయే దుర్లభము. ఎవడుచేసిన యర్థము వానిదైన యెడల ధర్మములకు హానివచ్చును. కావున శాస్త్రముల యందాచారపదమునకు ఏ యర్థము కలదో విచారించుట యావశ్యకము. ఆచారపదార్థము తెలియకనే, ఆచారవిషయక శాస్త్రమును చూడదలచుట నిష్ప్రయోజనము, ప్రకృతమందు ఈ హిందూదేశ వాసులకు ఆచారవిషయిక శాస్త్రమును విచారించయునుట యావశ్యకమని నేను వ్రాయబోవు "దురాచార పిశాచభంజని యను గ్రంథపీఠికయందు దెలియబడ గలదు. ఆచారవిషయిక శాస్త్రవిచారమునకు ముందు ఆచారశబ్దార్థమును గ్రహించుట కావశ్యకతను కలిగినందున ఈ "ఆచారనిరుక్తి" యను చిన్న గ్రంథమును వ్రాయుచున్నాడను ఇందు నావలన బొరమిన తప్పులు నాకు గనుపరచి, పెద్దలగువారు నాకు బుద్ధి చెప్పి సవరించుకో జేసిరేని మిక్కిలి సంతోషించెదను. మాకంటె నితడు పండితుడా? మాకు దెలియని యర్థమితడేది చెప్పగలడని గ్రంథమును జూచిన తోడనే నిరసించి మూలద్రోయక గ్రంథమును సాకల్యముగా [illegible]గించువారుగదా సాధువులు. కావున అటువంటి సాధులకే విన్నవించుకొన్నాడను.

విధేయుడు
దాసు శ్రీరాములు

శ్లో॥ ఓం నమశ్శుద్ధసత్వాఖ్య తేజసే పరమౌజసే
అణోరణీయసేతేస్తు మహతాంచమహీయసే॥

శ్లో॥ ఇయమాచారనిరుక్తి । ధర్మనుముఖశాస్త్రైకవేద్యమహితోక్తిః
సముపేతసాధుయుక్తి । జయతు సదా విహిత సంశయ విముక్తిః॥

వాక్యాని

1 అథాచారం నిర్వదిష్యామి,
2 ఆచారో ధర్మానుష్ఠితిశ్శాస్త్రే.
3 సజాతీయ క్రియాపరంపరాచరణ మితరత్ర.

దాసు వంశ సుధారాశి । సుధాంశునా శ్రీరామ
మంత్రిణా రచితేయ । "మాచార నిరుక్తి" స్సమాప్తా.

శ్రీ ర స్తు

# సం బో ధ

## అనువ్యాఖ్యానము

### 1. వాక్యము. అథాచారం నిర్వదిష్యామి.

ఈ భరతఖండమందలి యిప్పటి మనవారందరును ఏ విషయమును చక్క బరచుకొన బూనినను వృద్ధాచారమును విడువరాదని కొందరును, శిష్టాచారమును విడువరాదని కొందరును, దేశాచారమును విడువరాదని కొందరును, ఆచారమును విడువరాదని కొందరు, ఆ చా ర ప ద ము న కు నానావిధార్థములు చెప్పుచు ఏదుర్విషయమైనను సరే మానరాదని కొందరును, ఆచారము కలది దుర్విషయమే కాదని కొందరును మిక్కిలి చిక్కుల బెట్టి విషయసంస్కరణ మంగీకరించుట లేదని యందరికిని దెలిసినదే కదా ? కొన్ని యాచారములు సంస్కరించు కొనవలసిన యావశ్యకత ప్రకృత మందు మనకు కలిగి యున్నదనియెడి యంశమును నందరి కిని విశదమేకదా ? కాని వేదశాస్త్రములను నమ్మి ప్రవర్తించువారికి తద్విరుద్ధమైన సంస్కారము ఇష్టముగా నుండదు. గావున సంస్కరించుకొన బూనుకొనిన విష యముయొక్క సంస్కారము శాస్త్ర విరుద్ధమా కాదాయని కనుంగొన వలసివచ్చినది- శాస్త్రములలోనికి ప్రవేశింపక ముందే ఆచారముగల కార్యము సంస్కరింపరాదనెడి ప్రతిబంధకము అడుగు సాగనివ్వదు - ముందు దీనికి యిట్టి బలము శాస్త్రములు కలుగచేసినవా లేదా యని విచారించ వలసి వచ్చినది.

పిమ్మట శాస్త్రము లాచారమును గూర్చి యేమి చెప్పుచున్నవో చూడవలసి వచ్చినది - అటు పయిన విచార విషయము సంస్కరించ వచ్చునాయని విచారించ వలసి వచ్చినది. ఈ విచారము లిన్నింటికి ముందుగా విచారించ వలసినది ఆచారమనగా నేమిటో, దీని నెన్ని యర్థములతో వాడు చున్నారో, అందులో ఈ సంస్కార ప్రతిబంధ రూపమయిన యాచారమునకేమి యర్థమో నిశ్చయించు కున్నంగాని ఆచారవిషయిక విచారము సేయుట కూడదు. కాబట్టి గ్రంథకర్త యీ గ్రంథము వలన ఆచారమును నిర్వచించు చున్నానని చెప్పుచున్నాడు.

## 2. వాక్యము. ఆచారోధర్మానుష్ఠితిశ్శాస్త్రే

ధర్మశాస్త్రమునందు ఆచారపదమునకు ధర్మము యొక్క అనుష్ఠానమని యర్థము.

ప్రమాణములు

పరాశరమాధవీయము.

పీఠికయందు మాధవాచార్యులవారు వ్రాసినది

శ్లో ॥ ఆచారస్యాదిమః కాండః । ప్రాయశ్చిత్తసచాంతిమః
విహితాదాశ్రమాచారా । దిష్టాప్తిః పారలౌకికీ॥
ప్రాయశ్చిత్తం తథాచారః । శ్రౌతే ధర్మేతథేక్షణాత్
శ్రౌతోధర్మోగ్నిహోత్రాది । రాచారస్తదనుష్ఠితః॥
సధర్మో వ్యవహారస్స్యా । దాచారస్తు విపర్యయే
సాక్షాదిష్టాప్తి హేతుత్వా । దాచారః పూర్వమిష్యతే॥
ఆచారస్యాన్యథాత్వేషు । ప్రాయశ్చిత్త గవేషణం
సమకోచయదాచారం ॥ ప్రాయశ్చిత్త వ్రతానిచ
ఇత్యాది వచసాచారే । సంకోచోఖాసతేస్ఫుటం॥

ఈ శ్లోకములయందు ఆచారపదము ధర్మానుష్ఠానార్థకముగా ప్రయోగింపబడుటయేగాక మహాత్ముడగు మాధవామాత్యుడు "అగ్నిహోత్రాదిః ధర్మః తదనుష్ఠితః ఆచారః" అని కంఠోక్తిగా కూడ వివరించినారు.

ధర్మవక్త యీశ్వరుడు. దాని యనుష్ఠానమును స్మరించినవారు ఋషులు. ఋషులు స్మరించినవే యాచారములు.

మాధవాచార్యులు పరాశరస్మృతి 37 శ్లోకమునకు వ్యాఖ్యానము వ్రాయుచో దుదను వ్రాసిన విధము

"ననుకించిత్సాధారణం వదేతిధర్మః పృష్టః । ప్రత్యుత్తరంతుఆచారవిషయమితి॥

నసంగచ్ఛత ఇతిచేన్న, నిమిత్తనైమిత్తకయో । రాచారధర్మయోరభేదస్య వివక్షితత్వాత్

ఇందువలన విచారించగా- మాధవాచార్యుని మతమం దాచార పదమునకు ధర్మానుష్ఠాన పదమునకును అర్థమునందు భేదములేనట్లు స్పష్టమగుచున్నది.

మనుస్మృతి 1 వ అధ్యాయము 107 శ్లోకము మొదలు

అస్మిన్ ధర్మోఖిలేనోక్తో । గుణదోషౌచకర్మణాం
చతుర్ణామపివర్ణానా । మాచారశ్చైవ శాశ్వతః॥
ఆచారః పరమోధర్మః శ్రుత్యుక్తస్స్మార్త ఏవచ
తస్మాదస్మిన్ సదాయుక్తో । నిత్యంస్యాదాత్మవాన్ద్విజః
ఆచారాద్విచ్యుతో విప్రః । నవేదఫలమశ్నుతే
ఆచారేణతు సంయుక్త । స్సంపూర్ణ ఫలమశ్నుతే॥

ఈ శ్లోకములయందు ఈ మనుస్మృతియను ధర్మశాస్త్రమందు తన్ని ధర్మములను చెప్పబడినవనియు, కర్మములయొక్క గుణదోషములు చెప్పబడినవనియు, శాశ్వతమైన యాచారము చెప్పబడినదనియు, చెప్పబడినది. ఇందులోని యాచార పదమునకు కుల్లూకభట్టు వ్రాసిన యర్థము "పురుషధర్మరూప ఆచారః — అనగా ధర్మముయొక్క రూపమని యర్థము. ధర్మముయొక రూపము ఏదిగానుండును? ధర్మానుష్టానముగాక మరియొకటికానేరదు.

ఇందునకొక యుదాహరణము చూపుచున్నాను. యజ్ఞమునుధర్మము శ్రుతి స్మృతులయందు గానబడుచున్నది. యజ్ఞము నాచరించు చోటగాని దాని రూపమును కనుంగొనలేము. కాబట్టి యజ్ఞముయొక్క రూపము యజ్ఞక్రియాకలాపము యొక్కఅచారమే.

ఇందువలనజూడగా మహానుభావుడైన కుల్లూకభట్టుయొకతాత్పర్యము ధర్మానుష్టానమనియే.

యాజ్ఞవల్క్యస్మృతి ఆచారకాండము అధ్యాయము 7 వ శ్లోకము

శ్లో॥ శృతిస్స్మృతి స్సదాచారః । తస్యచ ప్రియమాత్మనః
సమ్యక్సంకల్పజఃకామో । ధర్మమూలమిదం జగత్॥

ఈ శ్లోకమునందు సదాచారః అ [illegible] మున ది. దీనియర్థమును విజ్ఞానేశ్వరుడు వ్రాయుచో "ఇదానీం ధర్మస్య జ్ఞా [illegible] హేతూనాహ" - అని మొదల వ్రాసినారు. ఇందువలన ఈ ముందు చెప్పి [illegible] ధర్మమును జ్ఞా [illegible] కము చేసుకొనుటకు హేతువులు- అని అర్థమగుచున్నదిగదా- జ్ఞాపకహేతువు [illegible]. శ్రుతి స్మృతి, సదాచారము. అనగా- వేదము, ధర్మశాస్త్రము, శిష్టాచారము, "సత్ అను పదమునకు "శిష్ట" అని అర్థము వ్రాసినారు. "ఆచార" అను పదమునకు అనుష్టానము అని అర్థము వ్రాసినారు. అనుష్టాన మనగా ధర్మానుష్టానము ధర్మజ్ఞాపకమా? ఏ యనుష్టానమైనను ధర్మజ్ఞాపకమాయని విచారించవలయును. అధర్మానుష్టా

నము ధర్మజ్ఞాపకమవునా? కాదు. కావున అచారమనగా ధర్మానుష్టాన మర్థము చెప్పితిమూ ధరానుష్టానము ధర్మమునకు జ్ఞాపకహేతువగుచున్నది. ఇందుకు దృష్టాతము ధర్మానుష్ఠాతయగువారు యజ్ఞము చేయుటంజూచి యజ్ఞమను ధర్మమునుస్మరించవచ్చును గాని, చండాలుడు మేకను గోయుచుండగా యజ్ఞమను ధర్మమును స్మరించవచ్చునా? కాబట్టి "సత్" అనగా శిష్టులు. శిష్టులనగా ధర్మానుష్టాతలు, వారి అచారము అనగా ధర్మానుష్టానము, అని యర్థము. యీ అర్థమునే విజ్ఞానేశ్వరులవారు చెప్పినారు. ఇదే విజ్ఞానేశ్వరులవారి తాత్పర్యము.

ఇకను ఋషుల తాత్పర్యమేమో విచారింతము. మహర్షులు తమ తమ ధర్మశాస్త్రములందు పురాణములయందు అచారపదమును ఏ యర్థమందు ప్రయోగించిరో ఆ యర్థమును గ్రహించితిమా, వారి తాత్పర్యము మనకు దెలియును.

పరాశరస్మృతి 1 వ అధ్యాయము 2 వ శ్లోకము

శ్లో॥ మానుషాణాం హితం ధర్మం వర్తమానే కలౌయుగే
శౌచాచారం యథావచ్చ వదసత్యవతీసుత॥

ఋషులు పోయి వ్యాసుని ధర్మములడుగుచో శౌచధర్మానుష్టానమును చెప్పుమనుటలో- "శౌచాచారం" అని అడిగినారు. ధర్మానుష్టానమే అచారము కాకపోతే అచారమును చెప్పుమన్నప్పుడు ధర్మానుష్టానములను చెప్పెది ధర్మశాస్త్రమేల చెప్పవలెను? పరాశరధర్మశాస్త్రము గాని పరశరాచారశాస్త్రముకాదు. అని చెప్పుదమా లేక పరాశరాచారశాస్త్రముగాని పరాశరధర్మశాస్త్రము కాదని చెప్పుదుమా? ఈలాగున చెప్పుటకంటె ఏది చెప్పినను ఒకేయర్థముగాన ఎట్లుగా చెప్పినను జెప్పవచ్చుననియే చెప్పవలెను.

కాబట్టి అచారపదమునకును ధర్మానుష్టానపదమునకును భేదమేలేదు. మరియు

పరాశరస్మృతి 1వ అధ్యాయము 16 వ శ్లోకము

శ్లో॥ సర్వేధర్మాః కృతేజాతాః। సర్వేనష్టాః కలౌయుగే
చాతుర్వర్ణ్య సమాచారం, కించిత్సాధారణంవద॥

వ్యాసాదులు పోయి పరాశరుని ధర్మములడిగినప్పుడు చతుర్వర్ణములకు సంబంధించిన ధర్మములను చెప్పుమని యడుగుటకు "చాతుర్వర్ణ్య ధర్మాన్" అనుటకు బదులు "చాతుర్వర్ణ్య సమాచారం" అని అడిగినారని చెప్పబడియున్నది. అచారమునకును ధర్మానుష్టానమునకును భేదమున్న యెడల ధర్మములడుగ బూనుకొని యాచారమునడుగుదురా? కాబట్టి యాచారమునకు ధర్మానుష్టానమే యర్థమని పరాశరులవారి యభిప్రాయము - ఇంతయుకాక

## పరాశరస్మృతి 1 వ అధ్యాయము 37 వ శ్లోకము

శ్లో॥ చతుర్ణామపి వర్ణానా ।మాచారో ధర్మపాలకః।
ఆచారభ్రష్టదేహానాం । భవేద్ధర్మః పరాఙ్ముఖః॥

కొని- వ్యాసాదులు ధర్మముల గూర్చి అడిగినారు, పరాశరులవారు ధర్మములను గురించి చెప్పినారు అని అందమా ? లేక వ్యాసాదులు ఆచారములను గురించి అడిగినారు, పరాశరులవారు ఆచారములను గురించే చెప్పినారందమా ? ఆచారములనినను ధర్మానుష్టానములనినను ఒకటే గనుక ఈ వివాదముతో పని లేదందమా ?

"మానుషాణాం హితంధర్మం" అనుటచేత ధర్మమునడిగినట్లు చెప్పవలసి వచ్చినది. "చాతుర్వర్ణ్య సమాచారం" అనుటచేత ఆచారంబనడినట్లు చెప్పవలసి వచ్చినది. కావున ఏది అడిగినను ధర్మానుష్టానమును గూర్చి యడిగినారని చెప్పవలయును. ఎందుచేతననగా ధర్మశాస్త్రములు ధర్మానుష్టానమును గూర్చికాక దేని గూర్చి చెప్పును ?

ఇదిగాక పరాశరులవారు 24 వ శ్లోకము-
"కృతేతు మానవా ధర్మాః । కలౌపారాశరాస్స్మృతాః॥"
అనుటవలన పరాశరులవారు చెప్పినది ధర్మములేయని చెప్పవలసి వచ్చినది.
35 శ్లోకము-

అహమద్యైవ తత్సర్వమనుస్మృత్య బ్రవీమివః ॥
చాతుర్వర్ణ్య సమాచారం శృణ్వంతుముని పుంగవాః ॥

అనుటవలన ఆచారమును గూర్చి చెప్పవలసి వచ్చినది. కాబట్టి ఆచారమని చెప్పినను ధర్మమని చెప్పినను ధర్మానుష్టానమేగాన ఏపదము వయోగించిన నొకటే యని చెప్పుటమేలు. ఇందువలన జూడగా పరాశరులవారి తాత్పర్యము ఆచార ధర్మానుష్టానములకు భేదము లేదనే అయి యున్నది స్పష్టము.

## మహాభారతము అను శాసనిక పర్వము

శ్లో॥ ఆచారలక్షణో ధర్మః । సంతశ్చాచార లక్షణాః ।
సాధూనాంచ యధావృత్త । మేతదాచార లక్షణం ॥

ఆచారమే చిహ్నముగాగలదిధర్మము. ఆచారమే చిహ్నముగ గలవారు శిష్టులు, సాధువులయను ష్టానమాచారము. ఆచార లక్షణ మిది,

| | |
|---|---|
| ధర్మము | ధర్మము |
| శిష్టుడు | ధర్మవంతుడు |

ధర్మమునకు శిష్టునకు ఆచారము చిహ్నము. శిష్టుని వ్యాపారము ధర్మాచరణము. ఎరదుచేత ననగా ధర్మవంతుడు గనుక. ధర్మవంతు రెండుచేత నాడనగా ఆచార చిహ్నము గలదు గనుక. ఆచార చిహ్నము గలిగిన ధర్మవంతుడు కావలెనా యనిన ఆచారచిహ్నము ధర్మమునకు తప్పక యుండును. గావున ధర్మము గలవారందరు నాచారము గలవారే - ఆచారము గలవారందరును ధర్మము గలవారే.

ఇందున కుదాహరణము

| | |
|---|---|
| ధర్మము | యజ్ఞము |
| శిష్టుడు | సోమయాజి |
| సాధువృత్తము ఆచారము. | హోమాదిక్రియానుష్టానము. |

ఇందు హోమాది క్రియానుష్టానమునకును యజ్ఞమునకును భేదమున్నదా? లేదు. హోమాది క్రియానుష్టానము సోమయాజికిని యజ్ఞమునకును చిహ్నములే కదా? కాబట్టి సాధువృత్తము శిష్టునకును ధర్మమునకును చిహ్నమయినది. తుదకు ఆచారమునకును ధర్మానుష్టానమునకును భేదము లేకపోయినది.

మరియొక రీతిగా వివరించెదను.

ఆచార లక్షణో ధర్మః = ఆచారమే లక్షణముగాగలది ధర్మము. ఇది బహువ్రీహి, = ధర్మముయొక్క లక్షణము ఆచారము = ధర్మలక్షణము ఆచారము. ఇది తత్పురుషము = ధర్మలక్షణము = ఆచారములు రెండును సమానార్థకములు.

సంతశ్చాచారలక్షణాః = సత్పురుషులు ఆచారమే లక్షణముగా గలవారు ఇది బహువ్రీహి = సత్పురుషులయొక్క లక్షణము ఆచారము = సత్పురుష లక్షణము ఆచారము = సత్పురుషలక్షణము ధర్మలక్షణము = సత్పురుష లక్షణము ధర్మ లక్షణము ఆచారము. ఈ మూడును సమానార్థకములు.

సాధూనాంచ యథావృత్తమే తదాచార లక్షణం .... సాధువుల అనుష్టానము ఆచారము = సత్పురుషుల అనుష్టానము ఆచారము.

కాబట్టి 1. సత్పురుషలక్షణము = 2. ధర్మలక్షణము = 3 ఆచారము = 4. సత్పురుషానుష్టానము.

ఈ నాలుగు సమానార్థకము లయినవి.

అందులో సత్పురుష లక్షణము సత్పురుషానుష్ఠానము సమానార్థకము అయి యుండగా లక్షణము, అనుష్ఠానము సమానార్థకములయినవి. కాబట్టి ధర్మానుష్ఠానము, సత్పురుషానుష్ఠానము, ఆచారము సమానార్థకములయినవి.

కూర్మపురాణము బ్రహ్మసంహిత-ఉత్తరభాగము

16 వ అధ్యాయము - 1-2-3-8 శ్లోకములు

శ్లో॥ ఏవందండాదిభిర్యుక్తశ్శౌచాచారసమన్వితః । ఆహూతోధ్యయనం కుర్యా
దీక్షమాణోగురోర్ముఖం॥

శ్లో॥ నిత్యముద్యతపాణిస్స్యాత్సంధ్యాస్వాచారసంయుతః । ఆస్యతామితిచోక్త
స్సన్ ఆసీతాభిముఖేగురోః॥

శ్లో॥ ఏవమాచారసంపన్న మాత్మవంతమదాంభికం । వేదమధ్యాపయేద్ధర్మం పురా
ణాంగాని నిత్యశః॥

ఈ శ్లోకముల యందలి ఆచారపదములకు ధర్మానుష్ఠానముతప్ప వేరే అర్థము చెప్పవీలులేదు.

దేవలస్మృతి 12వ శ్లోకము

శ్లో॥ కథంస్నానం కథం శౌచం ప్రాయశ్చిత్తం కథం భవేత్।
కిమాచారాశ్రితాయుష్టే చైతదాచక్ష్వ విస్తరం॥

ఈ శ్లోకమునందు ఆచారపదమునకు ధర్మమే అర్థము చెప్పవలెను. ఆలాగున చెప్పక మరియొక అర్థము చెప్పితిమా దేవలస్మృతి ధర్మములను గూర్చి చెప్పు శాస్త్రము కాకపోవలసి వచ్చును.

శంఖస్మృతి 14వ అధ్యాయము 4వ శ్లోకము

శ్లో॥ అనధ్యాయేష్వధీయానాః శౌచాచారవివర్జితాః । శూద్రాన్నరససంపుష్టాః
బ్రాహ్మణాః పంక్తిదూషకాః॥

ఇచ్చట ఆచారపదమునకు ధర్మానుష్ఠానమే అర్థము. శౌచాచారము శౌచ ధర్మానుష్ఠితి గనుక.

హారీతస్మృతి 1 అధ్యాయము 19 శ్లోకము.

శ్లో॥ ఏషామన్యతమాభావే । మృషాచారోభవేద్ద్విజః ।
తత్రవిద్యానదాతవ్యా । పురుషేణహితైషిణా ॥

ధర్మముల నాశరించని వాడు మృషావాదు డగును అని యున్నది గాన ఆచార రహితుడగును అని అర్ధము. ఆచార పదమునకు ధర్మానుష్ఠాన అర్థమైనది.

శంకర విజయము

శ్లో॥ స్మార్తాచార పరిక్రాంతః । పంచపూజా విశారదః ।
త్రిపుండ్రం భస్మనాకుర్వన్ । చందనేనచ సంవృతః ॥

శ్లో॥ స్నాత్వామృత్తికయాచోర్ధ్వ । పుండ్రంకుర్యా ద్విధానతః ॥

ఇందుస్మార్తాచార మనగా స్మృత్యుక్త ధర్మములని యర్ధముగాన స్మృత్యుక్త ధర్మానుష్ఠానమునకు స్మార్తాచారమునకు భేదము లేదు.

ఇంతియుకాక ధర్మానుష్ఠానములను గూర్చి చెప్పునట్టి ధర్మశాస్త్ర భాగమునకు ఆచారకాండయని అందరికి తెలిసినదే. కావున ఆచారకాండ వేరే మరియొక ఆచారములను గూర్చి చెప్పదుగదా - ఆచార పదమునకు ధర్మానుష్ఠాన మర్థమని చెప్పక యెట్లుగా తప్పను

మార్కండేయ పురాణము.

అధ్యాయము 23 – శ్లోకములు 27 మొదలు.

శ్లో॥ గృహస్థేనసదా కార్య మాచార పరిపాలనం ।
నహ్యాచార విహీనస్య । సుఖమత్ర పరత్రవా ॥

శ్లో॥ యజ్ఞదానతపాంసీహ పురుషస్యనభూతయే ।
భవంతియస్సదాచారం । సముల్లంఘ్య ప్రవర్తతే ॥

శ్లో॥ దురాచారోహిపురుషో । నేహాయుర్విందతేహితత్ ।
కార్యోయత్నస్సదాచారే । హ్యాచారోహ్యంత్యలక్షణం ॥

శ్లో॥ తస్యస్వరూపం వక్ష్యామి । సదాచారస్య పుత్రక ।

ఇందలి యర్ధము.

యః - సదాచారం. సముల్లంఘ్య ప్రవర్తతే – తస్య - పురుషస్య - యజ్ఞదానతపాంసి - ఇహ – భూతయే - నభవంతి

ఎవడు సదాచారమును విడిచి ఆచరించు చున్నాడో ఆపురుషునకు యజ్ఞ దాన, తపస్సులు ఈలోకమందు శ్రేయస్సు కొరకుకావు.

అనగా యజ్ఞ,దాన, తపస్సులు యుక్తముగా ననుష్ఠించిన గాని శ్రేయస్కరములు కావని తాత్పర్యము.

కాబట్టి యజ్ఞాదులు ధర్మములుగాన వానియొక్క అనుష్ఠానమే యాచారమని చెప్పుట న్యాయముగానే యున్నది.

3వ వాక్యము. సజాతీయ క్రియాపరంపరాచరణ మితరత్ర.

ఒకవిధమైన క్రియయొక్క పరంపర నాచరించుట ఆచారమని శాస్త్రము అందుగాక తక్కిన స్థలముల యందర్థ మగుచున్నది.

ఇది ఆచారపదము యొక్క శాస్త్రీయమైన నిర్వచనముకాదు గాన శాస్త్ర ప్రమాణములు లేవు. దీనికి లోకమే ప్రమాణము.

ఇంత వట్టు గ్రంథకర్త యభిప్రాయమును వారి సాన్నిధ్యమున గ్రహించి నంతలో నా శక్తి కొలది వివరించితిని. అపరాధములు క్షమింప గోరెదను.

ఉ॥ సారయశోమయుం డఖిల శాస్త్రవిచక్షణ దక్షుడర్థిమం
దారుడు దారధీయుతుడు దానుకులాంబుధి చంద్రుడీడితా
చారుడు రామమంత్రిమణి సాధువు లెల్లరు మెచ్చునట్లు "లా
చారనిరుక్తి" జేయు గనిసల్పితినేను సుబోధవ్యాఖ్యగాన్ ॥

కం॥ శ్రీరాముని కూరిమిగల
వారలలో నొకడ బప్పువంత్యడ ధృతి "నా
చారనిరుక్తి" కినువ్యా
ఖ్యారచనము జేసితిన్ జగన్నాథ కవిన్ ॥

సు బో ధా వ్యా ఖ్య స మా ప్త ము.

శ్రీ శ్రీ శ్రీ
శ్రీ శ్రీ
శ్రీ



# విగ్రహారాధన తారావళి

శ్లో॥ శ్రీసమాశ్లిష్టతనవే నిజాశ్లిష్టతనుశ్రియే
తస్మై ప్రకృతిలీనాయ శ్రీకృష్ణ బ్రహ్మణేనమః

శ్లో॥ అధునాయధామమహృది స్ఫురతితథైవాస్మినిగదితుంశక్తః
వివిధైర్యుక్తివిచారైః ప్రతిమూర్చాచిత్తశుద్ధిహేతురితి॥

శ్లో॥ సంకల్పోమమసత్యమ్ భవతాద్ధరికరుణయైవభక్తస్య
నోచేదోంసత్యమితి వ్యాహారస్త్వనృతవాదిముఖజనితః

శ్లో॥ సుఖంధర్మమూలంసశుద్ధాంగమూల శ్శరీరంహిశుద్ధక్రియామూలమేవ
క్రియాశుద్ధసంకల్పమూలానముద్య న్మనోమూలకస్సోపితద్భజస్య

శ్లో॥ ఫలంచిత్తశుద్ధేర్ద్విధాచైహికాఖ్యం తథాముష్మికంలోకజంసౌఖ్యమాద్యం
ద్వితీయంతునిర్వాణసౌఖ్యందురూహం తతోధారయేత్సాధనం చారుతస్యాః

శ్లో॥ సకలేంద్రియసంశుద్ధిః భక్త్యావిగ్రహపూజనాత్
స్నానాద్ధ్యానాచ్చనియమాత్ సైవచిత్తస్యశుద్ధతా

శ్లో॥ మనసశ్శుద్ధతాయోగః సర్వసంగవిసర్జనే
మనసశ్శుద్ధతాభోగః సతాంసంసారసంగ్రహి

శ్లో॥ యోగో ముక్తిప్రదస్సాక్షాత్ సాస్యాదాముష్మికంఫలం
భోగోభుక్తిప్రదస్సాక్షాత్ సొభవేదైహికంఫలం

శ్లో॥ జగద్గతమిశ్రప్రధానంనయతివస్తుదైవంశుభం జగచ్చలతిసర్వదానిగదితంన
దైవంతథా
జగచ్ఛ్రుతసేవ్యతామమలదైవబుద్ధ్యాతతో మనోమలవిశోధనంవిహిత
విగ్రహారాధనం

సీ. అన్యదారసమీక్షణాళి కష్టమశని | పరాధనాపేక్షకు పాముకాటు
అనృతవాదవినోదమునకు నైఘనకార | ధూర్తవర్తనలకుదుంపతెగులు
ద్యూతపానమృగయాదులకు బ్రహ్మాస్త్రంబు | మౌర్ఖ్యంబునకు వల్లమందునూనె
క్రూరసాంగత్యంబు గుత్తుకయురిత్రాడు | క్రోధలోభములకు గుండుదెబ్బ
గీ. ధరదివాస్వాపములకును దండుమారి | శౌచలోపపిశాచాభిచారకర్మ
యుత్తమప్రాణికోటికి జిత్తశుద్ధి | సాధనంబగు విగ్రహారాధనంబు 1

సీ. తగనిగందరగొండితనము కత్తులబోను | కూటసాక్ష్యములకంకుశపుపోటు
జంతుహింసలకర్ధచంద్రప్రయోగంబు | చీకటితప్పులచెంపపెట్టు
అశితప్పిసద్దాని కగ్నిప్రవేశంబు | పరపీడనకు గళప్రహరణంబు
న్యాయవిద్వేషంబునకు గాలపాశంబు | విశ్వాసఘాతకు వేరుపురుగు
గీ. విప్రపీడకులకెదిరింటివెన్నుపోటు | ద్రవ్యలోభంబునకునింటి స్తంభశూల
ఉత్తమ॥ 2

సీ. పలుకప్రల్లదముసంహరించువాకట్టు | అక్షిదోషనివారకాంజనంబు
ఒడలికపమర్చనకువర్ధనక్రియ | చేతులదుష్క్రియలైరచుబొండ
కాళ్ళదుర్గతుల జక్కంబెట్టుసంకెళ్ళు | నాసచేడ్పాటోర్చునశ్యకర్మ
చెవులపాపముగొట్టుసేయుసిద్ధరసంబు | మెదడుమాంద్యముగొట్టు మేటిమందు
గీ. పాయుమోహనదుష్క్రియాపాటవంబు, బట్టిబంధించుదృఢదారుపంజరంబు
ఉత్తమ॥ 3

సీ. నాయకులనైన బువ్వులగోయించు | బుటికెలబెట్టించుబూజనొంచు
గోటీశ్వరులనైన గొలకులముగిగించు | గుట్టలెక్కించు మ్రొక్కుల గ్రహించు
బండితోత్తమునైన బాతముల్దదిపించు | బాదముల్పట్టించు భక్తిముంచు
వీర్యవంతులనైన వీధులంద్రిప్పించు | వెలుగుపట్టించు సేవింపగాంచు
గీ. శౌర్యవంతులనైన గజ్జగిలిపించు | సారెకునుజెంపగొట్టించు స్వారిబూన్చు
ఉత్తమ॥ 4

సీ. దర్పకార్తులను గాంతలనుండి యెడబాపు | మోహవిభ్రాంతులముక్కుబట్టు
క్రోధశీలురజక్కగూర్చుండగా బెట్టు | పరమలోభులనొమ్మ బయిలవైచు
మదఘూర్ణితులవెన్ను మాటికివంగించు | మాత్సర్యపటునిజస్మరణమెలపు
మందబుద్ధులమంచిమంత్రముల్గదివించు | దంభజృంభకులహస్తములు మోడ్పు
గీ నీచవంశులకును మహానియతిగూర్చు | బధిరమూకాంధులకు సదభ్యాసమిచ్చు
ఉత్తమ॥ 5

సీ. ఉన్మాదమాలేక యుక్తప్రమాదమా । కానుపిదుమగిరస్తానుకొ్రరు
అజ్ఞానమాలేకయాత్మాభిమానమా । సికునేజాపాంసికునిప్పు
నవుటాలకాలేక నవ్వురుగప్పాలకా । జోగిదండంబుబై రాగిసంచి
వేసానకాలేక కాషుకోసానకా । జైన దేశములాచైన్నువాలు
గీ. మందమతులైనకొందరుమంది క్రిందు । మీమగానక కూమనానామలాడ
ఉత్తమ॥ 6

సీ. ప్రొద్దెక్కనందాకనిద్దురలేవని । మొద్దుమానిసి వీపుపెద్దగుద్దు
నెలకొక్కపరియైన నీళ్ళమున్గని మొండి । బండమానిసిరొమ్ముజెండుగుండు
క్రోలెమ్మునొచ్చిన గుదిరిగూర్చుండని । కొంటెమానిసికాలికుంటుగంటు
బడిపెట్టిచెప్పిన భగవంతుదలచని । చెట్టమానిసినెత్తిగొట్టుమొట్టు
గీ. హేయములజేరనీయకయింద్రియముల । గట్టనిగరానుమానిపిగట్టుకట్టు
ఉత్తమ॥ 7

సీ. నీవేరునేనేరని చెతంబలుకుశుష్క । వేదాంతిపైత్యవిచ్ఛేదిమందు
కడుపేది కుడుపేది కనకమేదనుశుద్ధ । లౌకికువాతసలాశిమందు
వేదంబువాదంబు నాదరానివరము । పాషండశ్లేష్మవిభంజిమందు
ద్వైవంబుదయ్యంబులేవను కేవల । ప్రకృతివాదిద్వంద్వపాటిమందు
గీ. జాతినీతులులేని దుర్జాతికమత । ధర్మవిదుసన్నిపాతవిధ్వంసిమందు
ఉత్తమ॥ 8

సీ. ఏదిజేసినకన్నులేవేళనలవదు । దుష్టమూర్తులజూడ దొరగనద్ది
ఏదిజేసినవీను లేవేళనలవదు । దుష్టవార్తలువిన దొరగనద్ది
ఏదిజేసినదేహమేవేళనలవదు । దుష్టవస్తులనంటదొరగనద్ది
ఏదిజేసిననాల్కయేవేళనలవదు । దుష్టరసమునాకదొరగనద్ది
గీ. ఏదిజేసిననాసిక యెపుడలవదు । దుష్టగంధంబుమూచూడదొరగనద్దె
ఉత్తమ॥ 9

సీ. కాళ్ళచేనడవదుకనులచేజూడదు । చెవులచేతవినదు చేతగొనదు
మేనిచేనంటదుకొనుచేవాలదు । గోళ్ళచేమునుమదుపళ్ళనగదు
వేళ్ళచేబట్టదు పిరుదగూర్చుండదు । నాసమూచూడదునాల్కదినదు
వెన్నువేనిలవదువీపుచేబండదు । పెదవిచేబల్కదుమదిందలచదు
గీ. జ్ఞానరూపంబచలము సంగరహితంబు । నమలసన్మూర్తి దైవతంబనుచుదెలుపు
ఉత్తమ॥ 10

సీ. కన్నులున్నవికానికననేరదంటివా | కనలేనివవియెట్లుకన్నులయ్యె
వీనులున్నవికానివిననేరదంటివా | వినలేనివవియెట్లువీనులయ్యె
కాళులున్నవికానికదలలేదంటివా | కదలనేరనివెట్లు కాళులయ్యె
చేతులున్నవికాని చేయలేదంటివా | చేయనివవియెట్లుచేతులయ్యె
గీ. కనులువీనులు కాళ్ళుచేతులనకగాంచు | వినుగదలుజేయుభగవంతుడనుచుదెలుపు
ఉత్తమ॥ 11

సీ. పదకింటశృంగారభావమబ్బుమల్లరం | గమునందుఘోరవీరముదయించు
ధర్మశాలలయందు దయపుట్టుసింధువ | ర్ణతగహ్వరములనద్భుతముబొడము
బొమ్మలాటలహాస్యమ జనించురాత్రుల | జీలదావున భీతి జేరవచ్చు
పృథుపలాస్థులగొర్ల భీభత్సము ఘటిల్లు | రణరంగములను రౌద్రంబుగెరలు
గీ. విడలేనిదిభగవంతునెరుగజాల | మట్టిశాంతంబుగూర్చుదేవాలయముల
ఉత్తమ॥ 12

సీ. అమ్మాయిబొమ్మరిండ్లలికి ముగ్గులువెట్టి | బొమ్మలమర్చునేబుద్ధితోడ
వివిధనాగరకోటివిక్టోరియారాణి | ఫొటోగ్రహించునేబుద్ధితోడ
పత్రికాధీశ్వరల్ బహువిధపటముల | పుటములవైతురేబుద్ధితోడ
సాహెబ్ పెస్త్కరునక్షాలుస్టాట్యూలుడం | బుగనిల్పుకొనుటయేబుద్ధితోడ
గీ. భూమికర్తనుదానొక్కబొమ్మజేసి | కొలుచువానికినొక్కింతఫలములేదు
ఉత్తమ॥ 13

సీ. కనులతో గూడశక్యముగానిసత్తును | మదిలోగనుటశాస్త్రమతముగాదు
వీనులతోవినవీలుపడనిసద్దు | మదిలోవినుటశాస్త్రమతముగాదు
త్వక్కుచేస్పృశియింపదరముగానివస్తు | మదిస్పృశించుటశాస్త్రమతముగాదు
జిహ్వతోదిననసాధ్యమైనఫలము ను | మదింజవిగొన శాస్త్రమతముగాదు
గీ. ఘ్రాణమున మూచూడగాగనిపువ్వు | మదినిమూచూచుటదిశాస్త్రమతముగాదు
ఉత్తమ॥ 14

సీ. వస్తునత్తనిబల్కనత్తేదిదెల్పుమా | యూరకేయూహించునూహలోన
చిత్తుచిత్తనిబల్కచిత్తేదిదెల్పుమా యూరకేయూహించునూహలోన
ఆనందమానందమను దాగిదెల్పుమా | యూరకేయూహించునూహలోన
తత్తుతత్తనిపల్కతత్తేదిదెల్పుమా | యూరకేయూహించునూహలోన
గీ. త్వమ్ముత్వమ్మనియసియనుత్వమసులెవ్వి|యూరకేయూహంజేయు
నూహలోన
ఉత్తమ॥ 15

సీ. కడుపులో దేవునిగట్టుదమందమా । కడుపుమూత్రపురీషకలితమయ్యె
గళమున దేవునినిలుపుదమందమా । గళము దుర్మాంసదుర్గంధయుతము
ముఖమున దేవునిమూయుదమందమా । ముఖముదుర్వాసనాంబుసహితంబు
తలలోన దేవుని వెలయింతమందుమా । తలజెడుకంపు మేదస్సుగలదు
గీ. దివ్యతరగోపురాచ్ఛమందిరములోన । పావనశిలాదులందేరుపరుపఁదప్పె
ఉత్తమ॥ 16

సీ. గాలికాధూళికాకనులుమూయుచు మ్రొక్కు । మంటికామింటికామాటజెప్పు
గోడకానీడకాకోరికల్ వెదవెట్టు । బొందికాగొందిగాబోగడికలిడు
గద్దెకామిద్దెకాకలగోరములుదెల్పు । చట్టికాయుట్టికాజడిసియొదుగు
తట్టకాబుట్టకాదైన్యంబు బ్రకటించు । గూటికారాటికాగొణుఁగుమనవి
గీ. యెదురనేదేనియొక్కటియీశ్వరత్వ । మహిమగలదున్నదనికానిమానవుండు
ఉత్తమ॥ 17

సీ. అతిచంచలునిగారసనణచిపెట్టినయట్లు । దొంగగొడ్డునుదొడ్డిద్రోలినట్లు
దుష్టజంతువుబోనుదూర్చిపెట్టినయట్లు । పెద్దదోమకుఁబొగబెట్టినట్లు
వానయెండలకుఁబవంతిగట్టినయట్లు । ఉట్ల క్షీరఘటంబులుంచినట్లు
కాచపాత్రనుదీపకళికజేర్చినయట్లు । పెట్టిలోరత్నంబుబెట్టినట్లు
గీ. పరులబీడించుటకుసిద్ధపడగనీక । పరమదుష్టప్రపంచంబు పాలుగాక
ఉత్తమ॥ 18

సీ. దైవంబుసర్వగతంబుసర్వముకీడు । దైవముమేలుసిద్ధాంతఫక్కి
సర్వదైవంబులసంబంధముడివోదు । కీడుమేళ్ళువిసదాకూడియుండు
తాసర్వమునుబాయు దైవంబొకటిలేదు । కీడుబాసిన మేలుచూడరాదు
దైవంబుకావలెదరియసర్వమునన్న । శీతాగ్నికై యాసజేసినట్లె
గీ. కానసర్వంబుడాసితద్గతముఁగొల్చి । పండితుడుముక్తుడగుననిపలుకుచుండు
ఉత్తమ॥ 19

సీ. సర్వంబనుటచేతసకలప్రపంచమ । ర్థంబగునిందొక్కతప్పులేదు
సర్వసేవనమేలసలవరాదోయని । తెలివిమాలినవారుపలుకవచ్చు
సర్వాంగనలనేలసంగమించగరాదొ । తెలియజాలరుతమబలముగాక
ఫలముచాంచల్యమే ప్రాపించుగానిని । యతినిశ్చలతలు బ్రాప్యములుగావు
గీ. కానగొండొకవస్తువుకనులయెదుట । నునిచితద్గతదైవంబుగనుటకాదె
ఉత్తమ॥ 20

సీ. అద్దగాదిదనేల యర్పించరాదన్న । కూపమంద్దినీలగూడరాదు
బంగారుతొడుగేలపద్మరాగము తేల । సింహాసనంబేల చెప్పుమన్న
సరిగంచుకోకలేమురిపెంపురై కేల । పరుపేల దిళ్ళేలబలుకరాదొ
రక్తిదెల్పుటకుకార్యకుగూర్పవలెనన్న । భక్తిదెల్పుటకు దైవమునకట్ల
గీ. దైవమునురాజుగురువుస్వీయావధూటి।నియతివిశ్వాసముల మెత్తునిరతమహహ
ఉత్తమ॥ 21

సీ. ఎందున్నదేవునకెంగేదరో నాకు । దెలియకున్నది మీరుదెలుపుడింక
ఎందునులేదదియందురాశూన్యంబు । సేవింపఫలమేమిచెప్పుడింక
అన్నిటియందున్నదందురాయ । యుతయుగాయువుమిదియరయుడింక
అందున్నదేదొయొందందురానిశ్చయ । జ్ఞానంబులేకుంటగాంచుడింక
గీ. కానికనియతద్రవ్యగతమహేతు । గొల్పుటిట్రేయమనిఋషుల్తలంచిరయ్య.
ఉత్తమ॥ 22

సీ. సారంబుదెల్పనగోరతియాన్మహతో । మహియానని తొలుబలుకులు
తనయందసర్వముతానుసర్వంబునం । దయునికిదీనియర్థమ్ముసుమ్ము
కరచరణాదిమత్కాయంబుసర్వేశ । బ్దార్థంబులోనిదేయనుమునుము
తానన దైవంబుదైవంబుశుద్ధంబు । సర్వంబుదలచుమీవలముమలము
గీ. గరళమునరోగిరోగంబుగడపినట్లు । చలమంబునగనుమునిశ్చలమమలము
ఉత్తమ॥ 23

సీ. ఎదురమన్నదిగోడయెద్పెదవేలరా । యెదురా నీ దేవుదేడనుండు
ముందునున్నదినింగిమూల్గెడవేలరా । యెదురా నీ దేవుదేడనుండు
కొట్టుచున్నదిగాలిగొడిగెదవేలరా । యెదురా నీ దేవుదేడనుండు
కంటిలోనిదినీరుకమమూతువేలరా । యెదురా నీ దేవుదేడనుండు
గీ. శివుడామాటునాగసైనదేవళాన । దివ్యతరమూర్తిమేలిమేదివహవ్వ
ఉత్తమ॥ 24

సీ. ఆనందమానందమాయెరామాదేవు । దెలమితేరెక్కియూరేగువేళ
ఆనందమానందమాయెరామాదేవు । దంచితాన్నములారగించువేళ
ఆనందమానందమాయెరామాదేవు । దమలావగాశీర్ధమాడువేళ
ఆనందమానందమాయెరామాదేవు । దలరజందనగంధమందువేళ
గీ. యెర మీదేవుడొక్కనాడేనిమీకు । నీడితానందమిచ్చినట్లెకనబడదు
ఉత్తమ॥ 25

సీ. అగ్నౌ క్రియావతామనిచెప్పినందున । నిప్పునందేదేవుఁడొప్పుకుండు
నేరవాదివోమనీషిణామనుటచే । బ్రొద్దులోదేవుండు బొలుచుచుండ
ద్ప్రతిమాస్వల్పబుద్ధీనామనుటచేత । ప్రతిమలోదేవుండుబలసియుండు
గాయోగినాంహృదయే యున్నమాటచే । హృదయంబునను దేవుడిమిడియుండు

గీ. నికనుపంసారులైనవారెల్లనల్ప । బుద్ధులనుటకుసందియంబుపడకుండు
ఉత్తమ॥ 26

సీ. హితబుద్ధిజూడగర్హితుడెహితుండగు । గురుబుద్ధిజూడపామరుడెగురుడు
దూరబుద్ధినిజూడజేరువేదూరంబు । పరబుద్ధిజూడనపరముపరము
అధికబుద్ధినిజూడనల్పమేయధికంబు । గుణబుద్ధిజూడదుర్గుణమెగుణము
పుత్రబుద్ధినిఁజూడశత్రుడేపుత్రుండు । విషబుద్ధిజూడనిర్విషమెవిషము

గీ. దైవబుద్ధినిఖూజింపదారువేని । దైవమేయగుబుద్ధిప్రధానమెందు
ఉత్తమ॥ 27

సమాప్తము

